# చదువుకున్నపిల్ల

అనువాదం: డాక్టర్ వి. ఎస్. శర్మ



ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ.

# చదువుకున్న పిల్ల

## బొంబాయి పిల్ల

నేను సెలవుల్లో మా ఇంటికి వచ్చాను. మా అమ్మ నన్ను కుశల మడిగి, మందహాసం చేస్తూ బొంబాయి అత్తయ్యదగ్గరనుంచి తనకు వుత్తరం వచ్చిందనీ, వాళ్ళ అమ్మాయి 'కోరా' త్వరలో ఈ దేశానికి బంధువుల్ని చూడ డానికి రానున్నదనీ, కొంతకాలం మా ఇంట్లోనే వుంటుందనీ చెప్పింది. కోరాను గురించి మా అమ్మ ఇదివరకే అప్పుడప్పుడూ చెబుతుండేది విన్నాను. కాని ఆ పిల్లను ఇంతవరకెప్పుడూ నేను చూడలేదు. నేను మా ఇంటికి చేరుకొన్న నాలుగోరోజునే కోరా మమ్మల్ని చూడ్డానికి మా ఇంటికి వచ్చింది.

"కోరా" హాన్స్ మామయ్య కూతురు. హాన్స్ మామయ్య చదువు కునే రోజుల్లో మహా చిలిపివాడు. చదువు ఆయన కేమాత్రం ఒంటబట్టింది కాదు. కొంచెం పెద్దవాడైన తర్వాత ఒక పెద్దమనిషి సహాయంతో బొంబాయికి వెళ్ళాడు. ఆ క్రొత్త వాతావరణంలో ఆయన కొంచెం కుదుటబడ్డాడు. ప్రారం భంలో ఒక్క కంపెనీలో గుమాస్తాగా పనిచేస్తూ ఆ దేశపు వర్తకశాలలోని గుట్టుమట్లు చక్కగా అవగాహనచేసుకున్నాడు. కొంతకాలమయ్యాక స్వయంగా వర్తకంచేయనారంభించి, లక్షాధికారి అయ్యాడు. ఇప్పుడు టీ తోటల కంపెనీలకు యాజమాన్యం వహించాడు. ఆయన స్వదేశానికి అప్పుడప్పుడూ వచ్చేవాడు. వచ్చినప్పుడల్లా మమ్మల్ని తప్పనిసరిగా చూసి వెళుతూవుండే వాడు. ఆ దేశాన్నుంచి తెచ్చిన అపురూపమైన వస్తువుల్ని మాకు బహుమతిగా యిస్తూవుండేవాడు. ఈ దేశంలో వున్నంతకాలం తనకు పరిచర్యచేయడానికి నౌకర్లనికూడా తనవెంట తీసుకొచ్చేవాడు. ఆయన భార్య చాలా మంచిది. మాకు దగ్గిర బంధువుకూడాను. ఆవిడకు మా అమ్మ అంటే ఎంతో ఇష్టం.

కోరా వయస్సులో నాకన్నా పెద్దది. "తమ్ముడూ" అని నన్ను ఎంతో ఆప్యాయంగా పిలిచేది. 'కోరా' నాకు బాగానచ్చింది. ఆ నల్లటి కళ్ళూ, వెంట్రుకలూ, ఆ చిరునవ్వూ చూస్తే ఈ లోకాన్నే పూర్తిగా మరచిపోయేవాణ్ణి. ఆ వయస్సులో వున్న ఆడపిల్లల్ని ఎంతోమందిని చూశాను గాని, కోరాకు వున్నంత కలుపుగోలుతనమూ, ఆ మర్యాదా వీళ్ళకు ఏకోశానగాని వుంటేగదూ?

పెదపిల్లలకు చూపించే గౌరవమర్యాదల్ని నాకూ చూపుతూ వుండేది. అమ్మపట్ల ఎంతో మర్యాద చూపుతూండేది. అన్నయ్యని చూసిందో లేదో దాని అంతరంగాన్నెంతో మెచ్చుకున్నది. తనే మగపిల్లవాడై వుంటే అదృష్టం అనిపించేదే అక్కయ్యనే పెళ్ళిచేసుకొనివుండేవాన్నని అంటూవుండేది. అక్కయ్యని విసిగిస్తూ వుండేవాళ్ళము. ఇంటిపనుల్లో అమ్మకు అక్కయ్యతో తను సహాయం చేసేది. సాయంకాలాలు ఇద్దరూ కలిసేవెళ్ళి కోరా అక్క య్యకు హిందూదేశాన్ని గురించి ఎన్నో సంస్కృతి గాధల్ని చెబుతూవుండేది. తను ఆ దేశంలో చూసిన వింతలు చెబుతూ అక్కయ్యను ఎప్పుడూ ఆనంద సముద్రములో ముంచుతూండేది.

ఒకనాడు నా చదువు విషయం ఆరాతీసుకుని "లూడ్విగ్ పెద్దవాడైన తర్వాత గొప్ప శాస్త్రజ్ఞుడవుతాడు. అప్పుడు ఈ చిలిపితనమంతా మానేసి అందరి మన్ననలు పొందుతాడు" అని అమ్మతో అంటూ నాకేసి చూసి చిరునవ్వు నవ్వింది. తనకు అంత అదృష్టముంటుందా అని అమ్మ ఒక నిట్టూర్పు విడిచింది. కంట తడిపెట్టింది. నేను కోరా మాటకు అడ్డువచ్చి "నాకు ఆటపాటలమీద వున్నంత శ్రద్ధ చదువుమీద వుండదుగదూ? హాన్స్ మామయ్య చిన్నప్పుడు నాకుమల్లేనే చిలిపిపనులు చేసేవాడట! తర్వాత దోవకు వచ్చాడట! ఆ సంగతి అమ్మ నాకు ఎప్పుడూ చెబుతూండేది. నా చదువును ఎలాగో ఒకలాగు ముగించేసి హాన్స్ మామయ్యలాగానే బొంబాయికి వచ్చేస్తాను. అక్కడ పులుల్ని చంపడానికి అవకాశం దొరుకుతుంది" అని నా ప్లానుల్ని కోరాకు చెప్పివేశాను.

ఆ పిల్ల నా ధోరణి విని ఫక్కున నవ్వింది. "నువ్వు చదువుకున్న చదువు చాలు. ఇప్పుడే నా వెంట బొంబాయి వచ్చేసెయ్. కాని ఒక విషయం మాత్రం ఆలోచించాలి. పులుల్ని చంపడం మాత్రం అంత సులభమైన పని కాదు. ఆ పనికీ కొంత అనుభవం సంపాదించుకోవాలి" అన్నది,

నేనీ జవాబుకు నిరుత్సాహపడతానని ఆ పిల్ల అనుకొన్నది కాబోలు! వెంటనే "నేను అనుభవాన్ని తర్వాత సంపాదించుకోవచ్చు. అంత వరకూ ఏనుగులు వున్నాయి కదూ. అవి అడవుల్లోనేకాక పట్నవాసాల్లో కూడా స్వేచ్ఛగా తిరుగుతూ వుంటాయని పుస్తకాల్లో చదివాను. మావటివాళ్ళు చాలా మంచివాళ్ళట. వాళ్ళను మంచిచేసుకొని ఏనుగులమీద ఎక్కి కూచుంటాను. పులులకి ఏనుగుల్ని చూస్తే భయమట. అందేత పులులు నన్నేమీచేయవు. అథవా అవేమైనా అవకతవకపనులు చేస్తే యా.....మావటివాళ్లు ఏనుగతో వస్తారు కదూ! వాళ్ళనే తినేస్తాయి... అంతేగా" అని మహాగర్వంగా చెప్పాను

ఈ సమాధానం విని కోరా ఎంతో సంతోషించింది.

"చాలా తెలివిగలవాడివి లూక్వెంగ్! ఈ తెలివిని చదువుమీద చూపించు. హైస్కూలు చదువు ఏదోవిధంగా ముగించు. అది పూర్తికావడానికి ఎంతో కాలం పట్టదు. ఆ తర్వాత మా దగ్గరకే వచ్చేయవచ్చు. నీ కోరికలన్నీ అప్పుడు చక్కగా తీర్చుకోవచ్చు." అన్నది.

పాడు చదువు! త్వరగా పూర్తి అవదు. బొంబాయి వెళ్ళడానికి ఈ చచ్చు చదువులు ఎందుకు? నేను పుస్తకాల్లో చదివాను; మా పంతుళ్ళూ ఎన్నో సార్లు చెప్పారు—నా వంటి పిల్లలు తల్లి దండ్రుల్ని వదలిపెట్టి కొత్త కొత్త దేశాలకి వలసపోయారు. చిలిపి చేష్టల్ని మానేసి, కష్టపడి పనిచేశారు. లక్షాధికారులయ్యారు. పేరు ప్రతిష్ఠలు సంపాదించుకున్నారు. ఇండ్లకు ధనరాసుల్ని తెచ్చుకొన్నారు. ఇంతకూ సాహసం వుండాలి. అదే ఎట్టి చిక్కు సమస్యలైనా సునాయాసంగా తేలుస్తుంది. నేనూ అలా సాహసం చేస్తేనా.........
అమ్మకూ, అక్కయ్యకూ పట్టుబట్టలూ, అమూల్యమైన సామాన్లూ పంపగలుగు

తాను. మా వాళ్లు నా సామర్థ్యాన్ని తెలుసుకొని సంతోషిస్తారు. ఈ వూళ్ళో వాళ్లూ నే నంత భాగ్యవంతుడ నయ్యానని విని స్థంభించిపోతారు. అందరూ నన్ను గౌరవంగా చూస్తారు......కోరాను చూశాక, ఆ పిల్ల హిందూదేశాన్ని గురించి చెబుతూన్న వింతల్ని విన్నాక నాలో ఎన్నెన్నో ఆలోచనలు రేకెత్తి వస్తున్నాయి. వీటినే గుక్కతిప్పకుండా ఆ పిల్లకు వివరింపసాగాను. కోరా వీటినన్నిటినీ—అడ్డు ప్రశ్నలు వేయకుండా, సావధానంగా విన్నది.

"లూడ్విగ్! నువ్వు చెప్పేవన్నీ బాగానేవున్నవి. కాని కొంతకాలం వోపికపట్టివుండడం మంచిది. ముందు నీచదువు ముగించు. ఆ పనిచేయడానికి నీకు శక్తివుంది. పట్టుపట్టి దీక్ష సాధించితివా నీ కోరికలన్నీ నిర్విఘ్నంగా కొనసాగుతాయి. నీ వుత్సాహాన్ని చూస్తున్నాను కదూ! అదే నిన్ను పైకితెస్తుంది. అప్పుడే అమ్మ, అక్కయ్యా నువ్వు పంపే బహుమతుల్ని పుచ్చుకొని ఆనందిస్తారు." అని కోరా నా వీపుతట్టుతూ మందహాసంచేస్తూ అంది.

కోరా మా ఇంట్లో వున్నంతకాలమూ ఆ అమ్మాయి దగ్గిరే వుండేవాణ్ణి. అవి మాకు సెలవురోజులు అవడంవల్ల నాకు అంతా తీరికేగా.

మా వూళ్ళో పార్కు వుంది దాని నడుమ ఊటగొట్టం వుంది. సాయంకాలం వూళ్ళోవాళ్ళందరూ వచ్చి దానిచుట్టూ కూచునేవారు. వారానికి రెండు మూడుసార్లు అక్కడ పాటకచ్చేరీలు జరుగుతూండేవి. కోరా, నేనూ ఈ పాటకచ్చేరీలకు హాజరవుతూ, సంగీతాన్ని తనివితీరా వింటూ ఆనందిస్తూ వుండేవాళ్ళం. అక్కడకూడ అందరిచూపులు కోరామీదే. కోరా ఆ వూరికి కొత్త మనిషి. ఆ పిల్ల ముస్తాబూ కొత్తే! వాళ్ళలో కోరాని వేలంవెర్రిగా చూసే వాళ్ళలో వోస్కర్ ఒకడు. వోస్కర్ మా వూరి మందులషాపులో గుమాస్తా. వాడు మా అత్తయ్య కూతురు "రోసా"ని ప్రేమించాడు. మావాళ్ళంతా వాడు రోసానే పెళ్ళాడుతాడని అనుకునేవాళ్లు.

వోస్కర్ అంటే నాకేమాత్రం ఇష్టంలేదు. వాడు మందులషాపులో చేసే హడావుడి నా కేమాత్రం నచ్చేదికాదు. నాకు గ్లూకోసు అంటే మహాయిష్టం.

దానిని కొనడానికి ఒకనాడు ఆ షాపుకు వెళ్ళాను. మందులు కొనడానికి వచ్చిన ఆడపిల్లలతో సరససల్లాపాలాడుతున్నాడు. ఎంతసేపు నిలుచున్నా నా వంక చూడనేలేదు. ఇక వోపిక పట్టలేకపోయాను. మందిపడుతూ గట్టిగా బల్ల గుద్దాను. దాంతో వోస్కారు చిర్రెత్తిపోయాడు. ఈ కాలపు కుర్రవాళ్ళకు మర్యాద అన్నదే లేదని గట్టిగా కేకలువేస్తూ "ఇలా చిలిపి పనులు చేస్తివా ఏం చేస్తానోచూడు" అని అరిచాడు. నాకు ఆ మాటతో కోపంవచ్చి "అంగడికి వచ్చేవాళ్ళని అవమానపరుస్తావా? ఈ సంగతి నీయజమానికి రిపోర్టుచేస్తాను చూడు!" అని నేనూ గట్టిగా అరిచాను. ఇక అక్కడ వుండడం నా మర్యాదకే లోపమనుకుని గ్లూకోసుకోసం మరొక షాపుకు వెళ్ళిపోయాను. ఆనాటినుంచీ వాడికి నన్ను చూస్తే కోపం. పార్కులో వాడినిచూచి కోరాతో ఆ సంగతి చెప్పివేశాను. నేనలా చెప్పడం వాడు ప్రక్కనుంచి వింటూనే వున్నాడు. కోరా అది విని వాడికేసి చూస్తూ ఫక్కున నవ్వింది. వాడు వూరకుండే ఘటమా? మిడిమిడి గుడ్లతో నన్ను చూచి 'ఏం చేస్తానోచూడు' అన్నట్లు చిందులుత్రొక్క సాగాడు. నేనూ ఏమీ చూడనట్టు నటిస్తున్నాను........

మరొకనాడు పాటకచ్చేరి పూర్తి అయ్యాక ఇంటిదారి పట్టాము. వోస్కారూ మా వెనుకనే వస్తున్నాడు. దోవలో మా అక్కయ్యస్నేహితు రాలు కనబడింది. ఆ పిల్లని పల్కరించి ఆ కబుర్లూ ఈ కబుర్లూ చెప్పుకోడానికి కోరా అక్కడే కొంతసేపు నిలిచిపోయింది.

అప్పుడు వోస్కారు నా దగ్గరకి వచ్చి నన్ను పల్కరించాడు. అంతకుముందు నేను చూసిన రౌద్రమూర్తి శాంతమూర్తిగా మారిపోయాడు. నాతో ఎంతో చనువుగల వాడికిమల్లె మాట్లాడసాగాడు. అమ్మ క్షేమంగా వుందా! అని మొదట అడిగాడు. తర్వాత మా ఇంటికి వచ్చిన ఈ పిల్ల ఎవరని ప్రశ్నించాడు. నేను వాడితో అనవసరంగా పేచీపెట్టుకోడం ఎందుకని "ఆ పిల్ల బొంబాయినుంచి వచ్చింది. మా బంధువు" అన్నాను.



"ఈ ఎండాకాలపు సెలవులన్నాళ్ళు ఇక్కడే వుంటుందా?" అని అడి
గాడు. ఆ ప్రశ్నతో వూరుకునే ఘటమా అది? "ఆవిడ బొంబాయిలో ఎందుకు
వుంది?" అని మళ్ళీ ప్రశ్నించాడు.

"ఆ పిల్లతండ్రి లక్షాధికారి. హిందూదేశంలో టీ తోటలన్నీ ఆయన
పెత్తనంలో వున్నాయి. టీని ఇతర దేశాలకు రవాణా చేయడానికి ఆయన అధీ
నంలో ఎన్నో స్టీమర్లు వున్నాయి. అవి ప్రతివారమూ టీ కేసుల్ని మన కోస్తా
లకి తీసుకొని వస్తూ వుంటాయి" అని జవాబిచ్చాను.

ఆ సంగతినంతా విని, వోస్కార్ వుబ్బి తబ్బిబ్బయ్యాడు. నా చేతిని
గట్టిగా నొక్కి "ఆ రోజున షాపులో నిన్ను అవమానపరిచాను. నన్ను క్షమిం
చాలి. ఇంకెప్పుడూ అలా చేయను. ఎప్పుడూ మా షాపుకే రావాలిసుమా! నీకు
కావలసిన గూకోసు నేనిస్తానులే" అని ఎంతో లాలింపుగా చెప్పాడు.
"సరే" అన్నాను నేను.

ఇంతలో కోరా నన్ను పిలిచింది. మేమిద్దరమూ ఇంటికి వచ్చేశాము.

## 2

ఆదివారం మధ్యాహ్నం భోజనాలయ్యాక విశ్రాంతితీసుకొంటు న్నాము. ఆ సమయంలో యెవ్వరో తలుపు తట్టారు నన్నే పిలిచారు. నేను తలుపు తెరిచాను. గుమ్మంలో నిలుచున్నది వోస్కరే! నల్ల సూటు, పచ్చని మేజోళ్ళు!........ఆ ముస్తాబు చూసేటప్పటికి నాకు ఆశ్చర్యం వేసింది. ఇతర రోజుల్లో చూస్తూవున్న విగ్రహం వేరు. ఇప్పుడు చూస్తూవున్న ఆకారం వేరు. ఎందు కిలా ఈ ముస్తాబుతో మా ఇంటికి అందరం విశ్రాంతితీసుకుంటూ వున్నప్పుడు–వచ్చాడో!

తలుపు తీశాక మందహాసంచేశాడు. తను అమ్మని చూసి ఎంతో కాలమైందనీ, ఆమెని చూడ్డానికి వచ్చాననీ ముసిముసినవ్వులతో అన్నాడు. లోపలికి తీసుకొచ్చి సోఫామీద కూర్చోమని చెప్పి, గబగబ అమ్మ గదిలోకి వెళ్ళి, "వోస్కర్ మనల్ని చూడటానికి వచ్చా"డని చెప్పాను. అమ్మ ఈ మాట విని చప్పున లేచి, దుస్తులు సరిచేసుకొని, హాలులోకి వచ్చి మర్యాద చేసింది. వోస్కరు తను అమ్మని చూచిపోడానికి వచ్చినవాడైతేకదూ? కబుర్లు చెప్పడంలో వాడికి మహా నేర్పు వుంది. తను మందులషాపులో చేస్తూన్న పనిని గురించి ఏకరువుపెట్టసాగాడు.

"వూళ్ళోవాళ్ళందరూ మా షాపుకే మందు మాకులకోసం వస్తూ వుంటారు. ఆ పని సర్దుకోడానికి వుక్కిరి బిక్కిరి అయిపోతున్నాను. పగటి పూటేనా వాళ్ళ రావడం! అర్ధరాత్రిళ్ళుకూడా విధీ విరామంలేకుండా వస్తుంటారు. యజమాని ఒక్కడే దీన్నంతా ఎలా చూసుకొంటాడు? నేను షాపులో తప్పని సరిగా వుండితీరాలి. వీళ్ళు రాత్రింబగళ్ళూ ఇలా దుకాణానికి రావడంచూస్తే ఈ వూళ్ళో జబ్బులకు మితి అనేది వుందాఅనిపించి విస్తుపోతూవుంటాను....చిన్న, పెద్ద జబ్బులకు కావలసిన మందులన్నీ మా దగ్గిరే వున్నాయి. అంచేతనే మన వూళ్ళో ఎవరూ ఇతర షాపులకు వెళ్ళక మా అంగడికే వస్తుంటారు. నేనే ఈ

పనినంతా చూసుకోవాలి. అందువల్ల నాకు విశ్రాంతి అనేదే లేదు" అని ఒక్క పెట్టున తను చేసే ఘనకార్యాన్ని చెప్పాడు.

అమ్మ అంతా విని ఎంతో జాలిపడ్డది. "ఎండాకాలం ప్రారంభమయిందికదూ! ఇక జబ్బులు తగ్గవచ్చు. అంచేత నువ్వు ఈ సెలవుల్లో మీ బంధువుల్ని చూడడానికి వెళ్ళవచ్చు." అన్నది.

అమ్మ చెప్పేది వినిపించుకుంటేనా! వూరికే ఆవులిస్తాడు హాలు నలుమూలలా కలయచూస్తాడు ప్రక్కగదుల్లో, తోటలో ఏ మాత్రం అలికిడి వినపడ్డా గబుక్కున కిటికీదగ్గరకు వెళ్ళి ఇటూ అటూ చూస్తాడు. అమ్మ వీడి అయోమయ వైఖరిని చూచి స్థభించిపోయింది. వీడు మాకు ఒక విధంగా బంధువే; మా అత్తయ్యకూతుర్ని వోస్కారు ప్రేమించాడని అమ్మకు తెలుసు. కొద్దిరోజుల్లో పెళ్ళి అవుతుందికూడాను. ఇలాటి అవకతవక మనిషి దానికి తగినవాడా అని అమ్మ సంకోచపడసాగింది. వాడు ఆవలింతలు మాన్లేదు.

తరువాత అక్కయ్యక్షేమసమాచారాలు అడిగాడు. అమ్మ దానికి జవాబు చెప్పింది. అక్కయ్య ఎక్కడ ఉన్నదని ప్రశ్నించాడు. అదృష్టవశాత్తు ఆ సమయాన అక్కయ్య ఇంట్లోలేదు. మా ఇంటికి కొత్తగా వచ్చిన అమ్మాయితో ఎక్కడికో వెళ్ళిందని అమ్మ చెప్పింది.

దాంతో వూరుకుంటే యింకేం!

'ఆ కొత్తపిల్ల ఎవరు?' అని ఆతృతతో తన కేమీ తెలియనట్లు అడిగాడు.

"మిస్ కోరా ప్రైఫర్. మా బంధువుల పిల్ల" అంది అమ్మ.

"ఎక్కడినుంచి వచ్చింది?"

"బొంబాయినుంచి యీ మధ్యే బంధువుల్ని చూడడానికని వచ్చింది. వాళ్ళనాన్న అక్కడ వర్తకుడు."

"అలాగా! చాలా సంతోషం. నే నా అమ్మాయిని చూడనేలేదే!",

“కోరా సాయంకాలంవరకు రాదు. నువ్వు వస్తావని తెలిసివుంటే ఇంట్లోనే వుండిపోయేది. ఆ దేశపు వింతలు చెప్పి నిన్ను సంతోషపెట్టేది.... కోరా కలుపుగోలు పిల్ల. అలాంటిపిల్లల్తో పరిచయం చేసుకోడం మంచిదే” అన్నది. వీడి బుర్రలో రేగుతూవున్న వూహాలు అమ్మకేం తెలుసు పాపం!

కొంతసేపు మాటా-మంతీ చెప్పుకుంటూ గడిపి, వోస్కారు లేచాడు. తను ఒక షాపుకు వెళ్ళాల్సిన పని వుందనీ, మరోనాడు వచ్చి కోరాతో పరిచయంచేసుకుంటాననీ అంటూ అమ్మదగ్గిర సెలవు తీసుకున్నాడు. నేను వాణ్ణి సాగనంపడానికి బయటికి వచ్చాను. అక్కడినుంచి వెళ్ళబోతూ, వోస్కారు నాకేసి చూశాడు. “మా షాపుకు ఇవ్వాళ సాయంకాలం తప్పకరా. కొత్త గ్లాకోస్ సరుకు వచ్చింది” అన్నాడు. వీడు అలా ఎందుకు అన్నాడో నాకు తెలుసు. నేను వాడికి సహాయం చేయాలి. పాపంలో పడవేస్తాలై అడ్డుపడ్డినా, వాడి ప్లాను చెడిపోతుంది కదూ!...

వాడు వెళ్ళిన మరుక్షణంలోనే [illegible]. కోరా ఇంటికి వచ్చాడు. కోరానిచూచి పకపక నవ్వుతూ—

“వోస్కారు వచ్చాడు నిన్ను చూడడానికి. నీతో పరిచయంచేసుకోడానికి బాగా ముస్తాబుచేసుకొని మరీ వచ్చాడు. ఎంతసేపో నీకోసం వేచివుండి యిప్పుడే వెళ్ళాడు” అన్నాను.

అంతేనా, వాడి ఆకారాన్ని-ముఖ్యంగా ఆ ఓరచూపుల్నీ, ఆవలింతల్నీ కళ్ళకు కట్టినట్లు వర్ణిస్తూ ఆనందించాను......

ఆనాడు సాయంకాలం మా అత్తయ్యా, మామయ్యా, వాళ్ళ రోసా కాఫీవేళకు మా ఇంటికి వచ్చారు. ఆవిడపేరు తెరీసు. ఆయనపేరు పేపీ. వాళ్ళు మాకు దగ్గిరచుట్టాలేమీ కాదు. వాళ్ళు వుండేదీ ఈ వూళ్ళోనే. వాళ్ళతో మరో అత్తయ్యకూడా వచ్చింది.

మా తోటలో కాఫీ పుచ్చుకొని చాలా సరదాగా గడిపాం. మేము వాళ్లకుమల్లే భాగ్యవంతులం కాము. మా ఆదాయం స్వల్పం. ఇతర్లసహాయ

మేమాత్రమూ అపేక్షించక వున్నదాంతోనే తృప్తిపడేది మా అమ్మ. అమ్మ ఈ బంధువుల రాకతో తన కష్టాల్ని కాస్త మరిచి, కులాసాగా కాలక్షేపం చేసింది.

కోరా కాఫీపని నంతా తనమీదే పెట్టుకొని, తనే చక్కని కాఫీ తయారు చేసింది. కోరాకి కాఫీచెయ్యడం బాగా తెలుసు. వాళ్ల దేశంలో కాఫీ గింజలు పుష్కలంగా పండుతాయి. కాఫీతయారు చేయడంలో ఆ దేశంవాళ్ళదే పైచేయి. అక్కడి పద్ధతులకే కోరా అలవాటుపడిపోయింది. . . .

కాఫీ తయారయ్యాక కప్పులో పోసింది. కోరాను చూడడం ఈ చుట్టాలకు ఇదే మొదటిసారి. కోరా ఆ రోజున ధరించిన సిల్కు బట్టలు ఈ దేశంలో లభించడం కష్టం. అది ఆనాడు అలంకరించుకొన్న నగలూ సామాన్యమైనవా? కోటీశ్వరుల పిల్లలకైనా వాటిని చేయించుకోవడం సాధ్యమవుతుందా!

పేస్ మామయ్య దృష్టి అంతా దానిమీదే. కోరా ఇచ్చిన కాఫీని ఎంతో ఆప్యాయంగా పుచ్చుకున్నాడు. రుచిగావుందని కోరాను ప్రశంసించాడు. మరోకప్పు కావాలని అడిగాడు. రెండోకప్పుతో తృప్తిపడ్డాడా? ఇంకో కప్పు కూడ తాగాడు. ఇదంతా వాళ్ళతో వచ్చిన అత్తయ్య చూసింది. ఈవిడను ఎల్లిస్ అత్తయ్య అని పిలుస్తాం. ఆవిడ ఇదంతా చూచి—

“నువ్వు అలా తాగటం మంచిదికాదు. నువ్వు అసలే జబ్బుమనిషివి. నీ గుండెనొప్పి సంగతి మరచిపోయావా? ఇంత ఘాటైనకాఫీ పుచ్చుకుంటే గుండెనొప్పి మూలంగా బాధపడాల్సివస్తుంది.” అని మామయ్యను కసురుకొని ఆయన చేతిలోని కప్పును అమాంతంగా లాగేసి, ఒక మూలపెట్టింది.

అమ్మ యిదిచూచి విస్తుపోయింది. “ఆయనకు ఈ కాఫీ అంత రుచిగావుంటే తనివితీరా తాగనియ్యవమ్మా” అంది, ఎల్లిస్ అత్తయ్యతో. ఆ మాట విని అత్తయ్యమొహం కందగడ్డలా మారిపోయింది. అమ్మవంక ఉరిమి చూస్తూ “ఆయన మంచికే ఇలా చేస్తే, నువ్వెందుకూ కలుగజేసుకోవటం?” అని రుసరుసలాడింది.

పాపం! కోరాకి ఈ అత్తయ్య విషయం బొత్తిగా తెలియదు. అత్తయ్య ఆయన్ని తమాషాచెయ్యడానికి ఇలా చేసిందని అనుకున్నది. మరో కప్పును తెచ్చి ఆయన ముందుపెట్టి దాన్ని వేడివేడి కాఫీతో నింపింది. ఎల్లిస్ అత్తయ్య కోరా ఇలా చేయడం చూసి వూరుకోగలదా? వెంటనే నోరు చేసుకుంది.

"పరాయివాళ్ళకి మా దేశపు మట్టూ మర్యాదా ఎలా తెలుస్తుంది? ఇక్కడి స్త్రీ ఎంతో భయభక్తులతో వుంటారు. మగవాళ్ళతో అంత చనువుగా వుండనే వుండమా?, ....ఈ అమ్మాయి ఎవరు? దీనికింత స్వాతంత్ర్యం ఎందుకిచ్చావ్!" అంటూ మా అమ్మమీదే తన కోపాన్ని వెళ్ళగక్కింది.

ఇలాంటప్పుడు అమ్మ ఏమనగలుగుతుంది? ఆ అత్తయ్యల శిక్ష మొక్కిందా ఇంక మాటాడటానికి శక్యంగాదు తనుమాత్రం నోరుచేసుకుంటే బాగుండదు. 'ఇందులో కోరాచేసిన తప్పేముంది?' అనిమాత్రం మెల్లగ అన్నది అమ్మ. అత్తయ్యలు యింతటితో వూరుకుంటే యింకేం?

తెస్సీ అత్తయ్యా, రోసా ఎల్లిసుఅత్తయ్యనే సమర్థించపోగారు. కోరా వాళ్ళకి కాఫీ పొయ్యడానికి వస్తే కప్పులమీద చేతులుంచి 'మాకు ఇక వద్దులే కాఫీ ఓకప్పుకన్నా ఎక్కువ పుచ్చుకోవడం మాకు అలవాటులేదు' అన్నారు...

యుద్ధంతో అలసిపోయి అత్తయ్యలు మాట్లాడటం లేదు. రోసా కూడా అంతే. పేపీ మామయ్య ఈ నాటకమంతా చూస్తున్నాడు. వాళ్ళ ధోరణి ఆయనకు బాగా తెలుసుగా. అంచేత ఇదేమీ చూడనట్టే నటిస్తున్నాడు. పాపం అంతకన్నా ఆయన ఏం చేయగలడు?....

కోరా కాఫీ ఇవ్వడమయ్యాక అక్కయ్యదగ్గరకు వచ్చి కూర్చున్నది. అత్తయ్యలతత్వం దానికేమీ తెలియదు. అంచేత ఆ రభసలో జోక్యం పెట్టుకోక కాఫీ రుచిచూస్తూ, రస్కులు తింటూ అక్కయ్యతో మాట్లాడుతోంది.

అత్తయ్యలిద్దరూ కోరా ఇలా ముచ్చట్లాడుకోవడం చూచి మండిపోయారు. "పెద్దవాళ్ళం ఇక్కడ వున్నామన్న సంగతి యీ పిల్ల గు

చాలి. ఇంత యిదిగా సంచరించడం మర్యాదకాదు.'' అని ఎల్లిస్ అత్తయ్య అమ్మతో కటువుగా అన్నది.

గోరుచుట్టుమీద రోకటిపోటులా మావయ్య తన కుర్చీని కోరాకి దగ్గరగా లాగుకొని అది చెప్పే కబుర్లు వింటూ కూచున్నాడు. మావయ్య తన దగ్గరకు రావడమూ, తను చెప్పే కబుర్లు వినడమూ చూచి, కోరా ఆయన కేసి ఆప్యాయంగా చూస్తూ మందహాసంచేసింది.

"మీరు తప్పక బొంబాయి రావాలి. మా అతిథులుగా వుండాలి. నేనే కాఫీ తయారుచేసి ఇస్తుంటాను. మా కాఫీ రుచికి అలవాటుపడ్డారా ఇక జర్మనీదేశంసంగతే పూర్తిగా మరచిపోతారు!'' అన్నది కోరా. కాఫీగింజలు హిందూదేశంలో కొండప్రదేశాల్లో ఎలా పండిస్తారో, ఆ పంటలోవున్న సాధక బాధకాల్నీ వివరించింది. మావయ్య ఆ విషయాలన్నీ వింటూ తలవూపి వూకొట్టుతూ, ఈ లోకాన్ని మరచిపోయాడనే చెప్పాలి!

ఎల్లిస్ అత్తయ్య ఇదంతా గమనించింది. ఇక ఆవిడ చుప్పనాతి తనం మాటలతో ఎలా వర్ణించను!

"చాలు. చాలు; ఆ పిల్లచెప్పే పిచ్చికథలు నువ్వు నమ్ముతావా?'' అంటూ ఆయన్ని గదమాయించింది. అంతటితో ఆగిందా? కోరామీద కత్తి దూసింది "నువ్వు మా ముసలాయనకు విషం పెట్టడానికి వచ్చావా?...... ఆయన బొంబాయికి వెళ్ళనక్కరాలేదు ఆ పాడు కాఫీ తాగి, జబ్బుపడనక్కరాలేదు. ఇక్కడ ఇలా వుంటే చాల్లే...'' అంటూ కోరాని విసిరివేసింది. తెర్సీ అత్తయ్యా ఆవిడకన్నా రెండాకులు ఎక్కువ చదివిన మనిషే! మావయ్యకేసి వురిమిచూస్తూ "ఇక నిన్ను యింట్లోనుంచి కదలనిస్తే కదూ. యింటిలో చేతి నిండా పనివుంటే, దాన్ని చేసుకుంటూ ఈ అంత్యకాలం గడిపితే చాలు...... నీకు కాఫీమీద అంత మోజుగావుంటే తాగడానికి ఆ కాఫీ ఏదో మేమే పోస్తాంలే'' అని ఆయన్ని చేయవలసిన అవమానాన్నంతా మా ముందరే చేసి చిందులుతొక్క నారంభించింది.

మావయ్య అదిరి పోయాడు. ఆ ఖంగారు మరిచిపోడానికి పొడుం పీల్చి, తుమ్మడం మొదలుపెట్టాడు. కోరా ఆ వాతావరణానికి తట్టులేకపోయి, దీనంగా అమ్మవంక చూసింది. అమ్మే ఏదోవిధంగా ఈ గండాన్నుంచి దరి చేర్చాలని అనుకొన్నది కాబోలు కోరా!

ఇంతవరకు ఎల్లిసు అత్తయ్యనే సమర్థిస్తూవున్న రోసాకి తండ్రి మీద వాళ్ళఅమ్మ దండెత్తడం నచ్చిందికాదు. ఎల్లిని అవమానించింది నాన్నను యిలా అవమానపరచవద్దని. కాని అత్తయ్య అంతమాత్రానికే శాంతిస్తుందా?

"రోసా! నువ్వా ఆ పిల్లతో చేరావా, తప్పకుండా చెడిపోతావు సుమా! జాగ్రత!" అని ఎల్లిసు అత్తయ్య దాన్ని గద్దించింది. రోసాఅమ్మ కూడ దానివంక వురిమిచూచి "ఆ పిల్ల పరసోలు బొంబాయి వాతావరణానికి సరిపోవచ్చు. నువ్వా వాడిని నేస్తం చేసుకుంటే నీ సంస్కృతి బుగ్గిపాలవుతుంది." అంటూ దానిమీద కేక వేసింది. ......

నాటకం ఇలా మా తోటలో అన్నిరకాల ఘట్టాలతో జరిగిపోతూంది. అమ్మ యింక చూడలేక తన కేదో తొందరపని వున్నదనే సాకుతో యింట్లోకి వెళ్ళిపోయింది. నాకూ విసుగెత్తి వాళ్ళవంక చూడడం మానేసి, తోటలోని పూలమొక్కలకేసి చూస్తున్నాను......

చిత్రం! వింత! అక్కడ ఏం కనబడిందనుకున్నారు! .........
నోస్కరు అక్కడనుంచి యీ తంతు చూస్తున్నాడు! వాడిని చూసేటప్పటికి నాకు ఆశ్చర్యంవేసింది. తనకు షాపులో బోలెడంత పని వుందని చెప్పి వెళ్ళాడుగదా! ఆ పని చూచుకోక మళ్ళీ ఇక్కడికే రావడం ఎందుకో? పోనీ వచ్చాడనుకోండి. రాజమార్గాన ఇంట్లోకి రాక, ఇలా ఆ చెట్ల వెనక దొంగకు మల్లె దాక్కొని చూడడమెందుకు? ....వాణ్ణి చూశాక నా వొళ్ళుమండిపోయింది. రోసాను దగ్గిరకు రమ్మని పిలిచి "ఆ చెట్టుచాటున నక్కి మనకేసి చూస్తున్న ఆ దొంగ ఎవరో చూడు!" అని చెవిలో వూదాను. రోసా వాడికేసి ఎగా దిగా

చూసింది. ఆ ముస్తాబులో వాడిని కొంతసేపు గుర్తించలేకపోయింది. "ఎవ్వరై వుంటాడు?" అని నన్నే మెల్లగా అడిగింది.

"ఇంకా గుర్తించలేదూ? వాడే—ఆ కాలాంతకుడు—ఆ పిల్లికళ్ళ వోస్కరే" అన్నాను.

మేమిలా గుసగుసలాడుకోవడం తెర్సీ అత్తయ్య పసిపట్టింది. నేనిచ్చిన జవాబుకూడా విని వుండాలి



"లూడ్విగ్ అబద్ధాలకోరు." అంటూ నన్ను చెడామడా తిట్టింది. నాకూ రోషంవచ్చింది. దిగ్రమింగుకుంటూ "అబద్ధాలకోరు ఎవరో నువ్వే తెలుసుకుంటావు. ముందు ఆ మనిషి ఎవరో చెప్పు, అత్తయ్యా! ... అక్కడ ఆ చెట్లవెనక. ఆ హాటును బాగాగుర్తించు. అది ఎవరిదో నీకు బాగా తెలుసు కదూ?' అని వాడిని వేలితో చూపాను. అందరూ అంతకుపూర్వపు గొడవ మరిచిపోయి ఈ దృశ్యం వేలంవెర్రిగా చూడసాగారు....వోస్కరు అందరి దృష్టి తనవైపే ఉండడం చూచి కంగారుపడ్డాడు. ఇక అక్కడ వుంటే కొంప

మునిగిపోతుందని, ఒక్క ఎగురులో కంచెనుదాటి, కాళ్ళకు బుద్ధిచెప్పుకుంటూ మరుక్షణంలో మాయమయ్యాడు.

అంతా మెరుపు మెరిసినట్లయింది. వోస్కర్ అలా గబగబ పరుగెత్తటం చూసి రోసా స్థంభించిపోయింది.

"అతను వోస్కరని నాకు ముందే ఎందుకు చెప్పలేదు?" అని నన్ను దబాయించింది.

"మీరంతా అలా చిందులు త్రొక్కుతూంటే మీతో చెప్పడం మంచిది కాదనుకున్నాను" అని రోసాకి సమాధానం ఇచ్చాను.

తెర్సీలఅత్తయ్యరౌద్రాకారాన్ని చూసి తీరాల్సిందే! బుసకొట్టుతూవున్న నాగుపాముకుమల్లె నా మీద విరుచుకుపడి చెడామడా తిట్టింది "వోస్కరు చాలా మంచివాడే—అలాంటివాణ్ణి ఇలా అవమానం చేస్తావా ఛడవా?" అని పెద్దగా అరిచింది.

ఇంతలోకి అమ్మ ఇంటిలోనుంచి వచ్చింది. "ఎందుకమ్మా అలా కేకలు వేస్తున్నావు?" అని తెర్సీలఅత్తయ్యని అడిగింది. ఆవిడ అమ్మతో నేను తమకు చేసిన మహాపరాధాన్ని చెప్పి కంట తడిపెట్టి ఏడ్వనారంభించింది.

"లూడ్విగ్! నువ్వు వాళ్ళని అలా క్షోభపెట్టడం తప్పు. ఇంకెప్పుడూ చెయ్యవుకదూ" అన్నది అమ్మ నాతో.

"ఈ ఛడవని చావదన్నారు. ఊరికే వదలి వీణ్ణి ఇలా చెడగొట్టుతావా? వోస్కరు ఎంత పెద్దమనిషి. అటువంటి ఆతన్ని ఈ వెధవ అగౌరవపరిచాడు. పాపం! ఇక అతను మమ్మల్ని ఎలా చూడగలుగుతాడు?........" అంటూ అత్తయ్య ఏదేదో వాగింది.

వాగుడులో ఆవిడకి సరిసమానమైన ఘటమే నేనూను!

"అదేమిటి అత్తయ్యా! అలా అంటావ్? నేనేం చేశానని నన్ను కసరికొట్టడం? వోస్కర్ని నేనేమీ అవమానంచెయ్యలేదు. ముమ్మాటికి

అవమానం చెయ్యలేదు. వోస్కార్నే అడుగు—ఈ సంగతి వాడికి బాగా తెలుసు" అని గట్టిగా దబాయించాను.

అమ్మ నన్ను సమర్థించుతూ "ఇవ్వాళ మధ్యాహ్నం అతను మా యింటికి వచ్చాడు. ఎన్నో కబుర్లుచెప్పాడు......." అని వాడు కోరా పరిచయంకోసం మళ్ళీవస్తానన్నదీ అదీ చెప్పింది.

అత్తయ్య ఈ మాటతో భగభగ మండిపోయింది. "ఎవరూ? ఎవరు వచ్చారంటావు?" అని గట్టిగా కేకేసింది

"ఆయనే, ఆ మందులషాపులో పనిచేస్తూవుండే ఆయనే. మీ రందరూ ఇక్కడికి వచ్చేముందే తనకేదో అర్జంటుపని వుందని వెళ్ళిపోయాడు" అని చెప్పింది అమ్మ.

ఆ సంగతి విన్నాక రోసా గడగడ వణికిపోయింది. ఇక నిల్చోడానికి శక్తిలేక నిట్టూర్పుతూ పక్కనవున్న కుర్చీలో కూలబడ్డది. కళ్ళు మూతలుపడ్డాయి ముఖమంతా ఎఱ్ఱబారిపోయింది....ఒకసారి అత్తయ్యకేసి చూసింది......అత్తయ్య ఎంతచెప్పినా అది వింటుందా? ఒకటే ఏడుపు......

రోసా నన్ను ఎక్కడ చూసినా గేలిచేసేది. "నువ్వు దీనికి పనికి పనికిరాని వాడివి. చదువు మానేసి కూలిపని చేసుకుంటే బాగుపడతావు" అని నా మిత్రుల ముందరే అవమానంచేసేది.

ఆ కసి తీర్చుకోడానికి ఇప్పుడు భలే అవకాశందొరికింది. రోసాని బాగా ఏడ్పించాలని—"వోస్కార్ కోరా ఎక్కడికి వెళ్ళిందనికూడా అడిగాడు. ఆ పిల్లతో పరిచయం చేసుకోవాలని ఆరాటపడుతున్నాడు." అని వాళ్ళముందర అనేశాను

రోసా ఆ మాట విన్నాక కూచున్న చోటునుంచి చివాలున లేచి నుంచున్నది.

"ఇక్కడ యిక ఒక్క క్షణంకూడ వుండను. ఇంటికిపోదాం రావే" అంది అత్తయ్యతో. వాళ్ల అమ్మ లేచింది. ఎల్లిసు అత్తయ్యకూడా లేచింది.

మావయ్యా వాళ్ళను అనుసరించాడు. అత్తయ్య వెడుతూ అమ్మకేసి వురిమి చూచి "మీరందరూ కలిసి మా మీద ఏదో కుట్ర పన్నుతున్నారు. మీ గొప్ప తనం మాకు తెలియదనుకొంటున్నావా?" అని నిష్ఠూరం వేసింది.

"ఏం కుట్ర? మే మేం చేశామని అలా అంటావు?" అని గడగడ వణకిపోతూ అడిగింది అమ్మ.

"నీ తప్పేమీ లేదులే. దీనికంతా కారణం ఆ పిల్లే! ఆ బొంబాయి పిల్ల చేసిన కుట్రే ఇదంతా" అని అమ్మని సమాధానపరుస్తూ కోరా వంక మిరిమిరి చూచింది. తరువాత అతిథులందరూ వెళ్ళిపోయారు.

కోరా అమాయకురాలు. పాపం! దానికేం తెలుసు వీళ్ళ అఘాయిత్యము, చప్పనాతితనం! వాళ్లు వెళ్ళిపోయాక "ఎందుకూ వాళ్లు నామీద అలా మండిపడతారు?" అని కోరా అమ్మను అడిగింది. అమ్మ ఏం జవాబు చెబుతుంది? ఆ రాద్ధాంతం మూలంగా అమ్మ ఇంకా గడగడ వణుకుతూనే వుంది. కుర్చీమీద కూచుని "ఏమోనే" అని తలతిప్పుకుంది. అమ్మకు కారణం తెలియకనా? అమ్మ సహనం, ఔదార్యం నాకు బాగా తెలుసు. నేనూ ఏం మాట్లాడకుండా జాలిగా అమ్మకేసి చూస్తూ నిలుచుండిపోయాను.

# ఫ్రాన్సు ఆరాటం

ఫ్రాన్స్ అంటే నా కెంతో యిష్టం. వయస్సులో నాకన్నా కొంచెం పెద్దవాడే. వాళ్ల నాన్నకి పానీయాల ఫాక్టరీ వుంది. ఈ వూరిబడి చదువును ముగించి తమ ఫాక్టరీలోనే పని నేర్చుకొంటున్నాడు. వాళ్ళ ఫాక్టరీలో ఈ ప్రాంతాల్లో వాడే బీర్, ఆల్కొహాల్, వైను మొదలైన పానీయాలు తయారు చేస్తుంటారు. వీటిని తయారుచేయడానికి ఏ యే వస్తువుల్ని సేకరించాలో, వాటిని ఏ యే మోతాదుల్లో మిశ్రమించేస్తే ఏండ్ల పర్యంతం పానీయాలు నిల్వ వుంటాయో ఆ మర్మాలన్నీ వాళ్ళనాన్న దగ్గిరే క్షుణ్ణంగా నేర్చుకున్నాడు.

వాళ్ల ఫాక్టరీ వూరుబయట పెద్ద తోటలో వుంది. దానికి వెనుక భాగం అంతా అడవి. ఆ అడవి చాలా పెదది. ఆ అడవిలో ఎలుగుబంట్లు, జింకలు, తోడేళ్లు మొదలగు జంతువులను ఎన్నిటినో చూడవచ్చు. ఫాక్టరీలో పనిలేని రోజుల్లో ఫ్రాన్స్ కాలంగడిపేది యీ అడవిలోనే. అడవి జంతువుల్ని వేటాడడంలో కూడా ఫ్రాన్స్ ఎంతో నైపుణ్యం సంపాదించాడు.

వీళ్ళ ఇల్లు మా యింటి ప్రక్కనే. వాళ్ళ ఇంటికీ మా ఇంటికీ మధ్య కంచెమాత్రం వుంది. ఇంటివద్ద వున్నప్పుడు తోటపని చేయడమంటే ఫ్రాన్స్‌కి సరదా. నన్ను మా తోటలో చూశాడా, కంచె దగ్గరకు రమ్మని పిలిచేవాడు. తన పని—పాటుల్ని గురించి ఎన్నో కబుర్లు చెబుతూ నన్ను సంతోషపెట్టేవాడు. వాడికి చుట్టలంటే ప్రాణం. నాకూ అప్పుడప్పుడు చుట్టలిచ్చి, వాటిని కాల్చి ఆనందించమని బలవంతంచేసేవాడు. కథలు చెప్పడంలో మంచి నేర్పరి. వాడుచెప్పగా నా కింతవరకూ తెలియని యీ ప్రాంతాల కథలూ, గాథలూ ఎన్నో విన్నాను. నన్నూ కథలు చెప్పమని పదేపదే అడిగేవాడు. నాకు తెలిసిన కథలల్లా మా స్కూలును గురించీ, మాష్టర్లను గురించీను. వాడికి ఈవూరు తప్ప బయటి ప్రపంచాన్ని గురించి ఏమీ తెలియదు. అంచేత నేను చెప్పే కథలువింటూ, పరవశుడైపోయేవాడు.

ఫ్రాన్స్ ఆజానుబాహుడు. కసరత్తుచేయడం, కుస్తీపట్టడం వాడికి బాగా తెలుసు. ఈతలో మొనగాడు. హాస్యమాడడంలో ఫ్రాన్సుకున్నంత నిపుణత్వం మావూళ్ళో మరెవ్వరికీ లేదనేచెప్పాలి. ఫాక్టరీలో పనిచేసే కుర్ర వాళ్ళకు ఫ్రాన్సు అంటే చాలా అభిమానం. అంచేత వాళ్లు ఫాక్టరీ పనులు ఏమాత్రం పేచీలు పెట్టుకోక శ్రద్ధతో సవ్యంగా చేసుకుపోతుంటారు.

మేము పూర్వం వారానికొకసారి తోటకంచెదగ్గర కలుసుకునే వాళ్ళం. కాని యీమధ్య ప్రతిరోజూ నన్ను పిలిచేవాడు. పూర్వపు రోజుల్లో వాడు వేసుకునే దుస్తులు సామాన్యమైనవే. కాని యిప్పుడు మంచి దుస్తులే వేసుకుంటున్నాడు. కాలరూ నెక్టై కూడాను! ఈ దుస్తుల్లో వాణ్ణిచూస్తే నాకెంతో ముచ్చటగా వుండేది. పూర్వంలాగ కాక పెద్దమనిషిని కలుసుకున్నట్టు నాకు నమస్కారంచేస్తుండేవాడు.

మా తాతయ్యా, మామయ్యా, వాళ్ళమ్మాయి తరుచుగా మా యింటికి వస్తూండేవారు. మేమంతా మా తోటలో కూర్చుని కాఫీతాగుతూ కబుర్లు చెప్పు కొంటూ కాలక్షేపంచేసే వాళ్ళం. ఆవరల సమతో లోనుంచి మా అందరినీ చూస్తూండేవాడు ఫ్రాన్సు. మా అతిథులు ఎలాకూచుంటారో, ఎవరెలా మాట్లా డుతారో, ఎలా కాఫీ త్రాగుతారో అనుకరించి చూపుతూ, వాళ్ల మాటలను ప్రతికల్పనచేస్తూ నన్ను నవ్వించేవాడు. నన్నూ అలా అనుకరించమని బల వంతం చేసేవాడు. నాకు అలా అనుకరించడం చేతకాదనీ, నేను నా బుద్ధిని చదువుమీందే లగ్నంచేయడం అవసరమనీ అంటూండేవాణ్ణి. ఫ్రాన్సుకు నా పద్ధతి నచ్చేదికాదు. ఒకనాడు ఇలా అన్నాడు—

"ఎందుకూ ఆ చదువు?"

"చదువుకోకపోతే గౌరవం ఎలా వస్తుంది? ఉద్యోగాలూ—గట్రా చేయడానికి అవకాశం ఎలా లభిస్తుంది? ఫ్రాన్స్! నీ సంగతే చూడు! ఎలిమెంటరీ స్కూలు చదువుతో నీ విద్యను సరిపెట్టావు. అంచేతనే ఫాక్టరీలో పనిచేస్తూ తృప్తిపడాల్సివచ్చింది. నీ వాలకాన్నిబట్టే నువ్వు విద్యావంతుడవు కావని ఈ

వూళ్ళోవాళ్ళందరికీ తెలుసు. అంతేనా? మర్యాదగల కుటుంబాల్లో పుట్టి పెరిగిన ఆడపిల్లలు నీవంటివాళ్ళ నెలా గౌరవించగలుగుతారు?'' అన్నాను.

"అవునోయి, నువ్వు చెప్పేదాన్లో కొంతనిజం వుంది. నా కంత అదృష్టం వుంటేకదూ!'' అని నిట్టూర్పు విడుస్తూ తలవంచుకున్నాడు. కంట తడిపెట్టాడు. ఆ దృశ్యాన్ని చూసేటప్పటికి నాకు జాలేసింది...... వాడి బుర్రలో ఏ యే ఆలోచనలు రేగుతున్నాయో? నాకేసి చూస్తూ "మీ యింటికివచ్చిన కొత్త అమ్మాయి కన్పడడంలేదే? ఆ అమ్మాయి బాగా వుందా?'' అన్నాడు మెల్లగా.

"ఆ! బాగానే వుంది. ఈ వూరి వాతావరణం కోరాకి నచ్చింది. అంచేత ఇంకా కొన్నాళ్ళు ఇక్కడే వుంటుంది.'' అని నేను చెప్పాను. ఇక వాడి దృష్టి మా యింటివైపే!

"ఆ అమ్మాయి అంటే నాకు చాలా ఇష్టం. ఆమె పట్నవాసం పిల్ల. పెద్ద చదువు చదివివుండాలి. నావంటి పల్లెటూరివాళ్ళతో ఆ అమ్మాయి మాట్లాడుతుందా?'' అన్నాడు.

అందుకు నే నేమీ మాట్లాడలేదు. వాడికి దాంతో కోపంవచ్చి, ఇంట్లోకి వెళ్ళబోతూ, ఏమనుకున్నాడో, దీనంగా నావంక చూశాడు. "నువ్వొక్కసారి ఆ అమ్మాయితో నా సంగతి చెప్పిచూడు'' అనేసి గబగబ వెళ్ళిపోయాడు. "చూస్తానులే'' అని నేనూ మా ఇంట్లోకి వెళ్ళాను.

ఫ్రాన్సు కోరికతీర్చడ మెలాగు? అది సాధ్యమవుతుందా? అని ఆ సాయంత్రం నేను ఆలోచించాను. అదృష్టవశాత్తు ఆనాటి మా సాయంత్రపు భోజనసమయంలో, ఫ్రాన్సువాళ్ళఫ్యాక్టరీలో తయారైన పానీయాన్నే మా అమ్మ తెచ్చి బల్లమీదపెట్టింది. ముందు కోరాయే దాన్ని పుచ్చుకొని, చాలా రుచిగావుందని మెచ్చుకున్నది. అమ్మకూడ రుచిచూస్తూ తలవూపింది.

ఫ్రాన్సు సంగతి చెప్పడానికి ఇదే మంచి అవకాశ మనుకున్నాను. "ఈ పానీయాన్ని బాగుందన్నారు కదూ మీరందరూ? మనం దీన్ని తయారు చేసినవాళ్ళనికూడా మెచ్చుకోవాలి, వాళ్ళని గౌరవించాలి. ఏమంటావ్ కోరా?''

అన్నాను. అమ్మ నాకేసిచూస్తూ, "తప్పకుండాను. తమ కర్తవ్యాన్ని తాము చక్కగా నిర్వహిస్తూంటే వాళ్లపట్ల మనం మర్యాద చూపవలసిందే. అందులో తప్పేముంది?" అంది.

'ప్రొఫెసర్లు తమ ధర్మాన్ని చక్కగా నెరవేర్చుతూ వుంటారు. వాళ్ళపట్ల మనం భక్తిగౌరవాలు చూపుతూ వుంటాం. అదే మాదిరి యీ పానీయాన్ని అంత తెలివితేటలతో కమ్మగా తయారుచేయుచున్నవాళ్ళనీ మనం గౌరవించవచ్చుకదూ?" అని అమ్మను అడిగాను

నా ప్రశ్న మా అమ్మకు నచ్చిందికాదు. "ప్రొఫెసర్ల సాంప్రదాయాలు వేరు. దేవుడు వాళ్ళను ఆ వృత్తిలో వుంచాడు. వాళ్ళూ ఆ వృత్తిని చక్కగా నిర్వహించుతున్నారు. అంచేతనే ప్రొఫెసర్లు అంటే సంఘానికి ఎంతో గౌరవం. వాళ్ళపట్ల అభిమాన - ఆదరాలు చూపుతూ వుంది. అట్టి గొప్ప వృత్తిలోనివాళ్లను ఇతర వృత్తులవారితో పోల్చడం ఏ మాత్రం మంచిదికాదు. లూడ్విగ్! ఈ రహస్యాన్ని నువ్వు బాగా అర్థంచేసుకోవాలి" అంది అమ్మ.

"అమ్మా! నువ్వు చెప్పింది బాగానే వుంది, కాని ప్రొఫెసర్లు ఎంత గట్టివాళ్ళో పానీయాలుతయారుచేసేవాళ్ళూ తమ విద్యలో అంతగట్టివాళ్ళే. వాళ్ళని పానీయాలు తయారుచేయమని దేవుడే ఒక కట్టుబాటు చేశాడు. వాళ్ళకి దురదృష్టవశాత్తు ప్రొఫెసర్లకు లభించినంత చదువు అబ్బిందికాదు. ఈ కారణంగానే వాళ్ళని ప్రొఫెసర్లతో సరిపోల్చకూడదనీ, తక్కువజాతివాళ్ళుగా చూడాలనేకదూ నువ్వు అనడం?" అని అడ్డుప్రశ్న వేశాను.

ఇది విని కోరా నవ్వింది. "నీ వాదం ఏమాత్రం సరికాదు. అందరినీ సరి సమానంగా చూడసాగితిమా, సంఘం తారుమారై పోతుంది నువ్వే నీ చదువును చాలించి, పానీయాలు తయారుచేసేవాళ్ళ వృత్తిలో ప్రవేశిస్తివా నీ జాతే వేరవుతుంది. చదువుకున్నవాళ్లపట్ల చూపే మర్యాదా, గౌరవం నీకు చూపడానికి ఎలా వీలుంటుంది?" అని ఒక్కక్షణంలో తీర్పు ఇచ్చివేసింది.

అమ్మ కోరాతీర్పును సమర్థిస్తూ "ఎందుకొచ్చాయి ఈ పాడు

బుద్ధులు నీ బుర్రలోకి? వాళ్ళ వాళ్ళ వృత్తుల్నిబట్టి గౌరవించాలి. అందర్నీ సరి సమానంగా చూడనారంభించామా, పెద్దలనాటినుంచీ వస్తూవున్న సాంప్రదాయా లన్నీ మంటలో కలిసిపోతాయి'' అని నన్ను చీవాట్లుపెట్టింది.

అమ్మకు మళ్ళీ జవాబివ్వలేదు. వాదించినా లాభమేముంది? అమ్మది పిడివాదం. ఆమెను వొప్పించడం నా వశమా!....

అసలు నాకీ ఆలోచన ఎందుకు కలిగిందో కోరాకు తెలుసు. ఇక అమ్మ సంగతి చెప్పడమెందుకు? ఒక విషయం మాత్రం నన్ను పీడిస్తోంది. మరి అమ్మ ఎంత మండిపడినాసరే, అడిగితీరాలనుకున్నాను.

"అమ్మా! మనవాళ్ళు ఏ వృత్తిలో వున్నా, తమ తమ వృత్తుల్ని చక్కగా నిర్వహించుతూంటే వాళ్ళందరిపట్లా గౌరవం చూపాలనే నాకోరిక.'' అని అదురూ,బెదురూ లేకుండా అనేశాను. ఆ మాటకి అమ్మ చిరెత్తి పోయింది.

"వాళ్ళ సంగతీ, వీళ్ల సంగతీ నీ కెందుకురా? నీకు ఇంత చదువు చదివే అవకాశం లభించినందుకు గర్వపడు. మీ ప్రొఫెసర్లకు భక్తి గౌరవాలు చూపు. నీతో చదువుకుంటున్నవాళ్లపట్ల మర్యాదగా వుండు. ఇక తక్కిన జాతులవాళ్లతో ఏమాత్రం స్నేహంచేయవద్దు. వాళ్లంతా అనాగరికులు; చదువు సంధ్యలు బొత్తిగా లేనివాళ్లు. వాళ్లతో కలిసి తిరిగావా మన ప్రతిష్ఠ యేమవుతుందో మంటగలుస్తుంది......ఊ. నిన్ను చూస్తున్నాను కదూ! నీకు ప్రక్క యింటివాళ్ల అబ్బాయితో అంత స్నేహం ఎందుకుచెప్పు?''అని గౌరవ మర్యాద లంటే ఏమిటో నాకు చెప్పసాగింది అమ్మ

కోరా అమ్మ వ్యాఖ్యానాన్ని అక్షరాలా సమర్థించుతూ"అమ్మచెప్పిన దాంట్లో తప్పేమీలేదు. నువ్వు అలా ప్రక్కయింటి అబ్బాయితో స్నేహం చేస్తుంటే అమ్మకు గౌరవం వుంటుందా? అలా ఇకముందు చేయవద్దు.'' అని నాకు వాళ్లతత్వాన్ని బోధించడానికి ఆరంభించింది. దాంతో వూరుకుంటే ఇంకేం? ఫక్కున నవ్వుతూ ప్రాన్సును హేళనచేయసాగింది.

ఇదంతా చూసి నా వొళ్లు మండిపోయింది. వాడి తప్పేముందని వాడితో స్నేహంచేయవద్దంటోంది అమ్మ? కోరా ఆ వాదాన్నే ఎందుకలా సమర్థిస్తుంది? ఎందుకా హేళన? మేము బీదవాళ్లమైనా పెద్ద చదువు చదువుకోడానికి నాకు అదృష్టం కలిగింది. ఆర్థికరీత్యాచూస్తే, వాడు మా కేవిషయంలోను తీసిపోడు. కాని. పాపం! ఎలిమెంటరీచదువుతోనే వాడు చదువు ముగించాల్సి వచ్చింది. అదే మా ఇద్దరికీ తారతమ్యం. కాని. మా వాళ్ళు చెప్పే కారణాలను బట్టి నేను స్నేహం మానడం ఎలా?

ఫ్రాన్సు మంచివాడు. కోరా మా ఇంటిపద్దవుండడం చూశాడు. దాని కలుపుగోలుతనాన్ని చూచి మురిసిపోతున్నాడు—కోరాని పలకరించాలి. దాని కబుర్లు విని ఆనందించాలి—ఇదే వాడి ధ్యాస. పార్కులో కోరాని ఎన్నో సార్లు చూశాడు. కోరా వాళ్ళతో వీళ్ళతో మాట్లాడుతూండగానూ చూశాడు....

ఆ పిల్లని ఎలాగైనా కలుసుకోవాలి. అవకాశం దొరికితే దానితో తనివితీర మాట్లాడాలి. అప్పుడే వాడి మనస్సు కుదుటబడుతుంది. నన్నీ అవకాశాన్ని కల్పించమని ప్రాధేయపడుతున్నాడు. వాడి అమాయకత్వానికి నాకు జాలివేస్తోంది....శాయశక్తులా ఫ్రాన్సు కోరికను నెరవేర్చితీరాలి. ఇది నా విద్యుక్తధర్మం. అందుకోసమే ఆవిధంగా మావాళ్లముందర వీడి ప్రసక్తి తెచ్చాను. కాని నా కృషికి వాళ్ల సంభాషణ పెనుభూతంలా అడ్డువచ్చింది.

ఇది చిక్కుసమస్యే! దీన్ని విడదీయడం ఎలా? ఇదీ నా ఆందోళన! కోరా ఆవలించితే పేగుల్ని లెక్కపెట్టేరకం. నా విచారాన్ని అది అతి సులభంగా గ్రహించింది.

"అయితే చెప్పు? పానీయాలు తయారుచేసేవాళ్లనుగురించి నువ్వింత పట్టుదలతో ఎందుకు ప్రశ్నిస్తున్నావో ముందు నాకు చెప్పు" అన్నది సూటిగా.

"ఫ్రాన్సు నా స్నేహితుడు. మనుష్యుల్లో ఎందుకిలా వ్యత్యాసాలు వుండాలని నన్నడిగాడు. వాళ్ళ నాన్నకు ఆస్తిపాస్తులు వున్నాయి. వూళ్ళో ఆయనంటే గౌరవమూ వుంది. కాని నాలాగా పెద్దచదువు చదవలేదు.

అంచేత చదువుకున్నపిల్లల్ని చూస్తే వాడు జంకుతాడు. ఇక ఆడపిల్లలసంగతో! వాళ్లెవ్వరూ వాణ్ణి పలుకరించరు. వాళ్ల చదువు కొద్దిపాటిదే అయినా పెద్దచదువులు చదివే వాళ్లని చూశారా, మరి వారిని పట్టడానికిపగ్గాలు చాలవు!........" అని నా సొద చెప్ప నారంభించాను.

అమ్మ నన్ను సాంతం చెప్పనిస్తుందా? పానకంలో పుడకలాగా అడ్డు వచ్చి "ఏ పిల్లను గురించీ ఇంతసోది?" అని అడిగింది.

"ఒక పిల్ల అనికాదు. అందరివీ ఇలాంటి భావాలే" అన్నాను.

"లూడ్విగ్! నువ్వు కుర్రవాడివి. వూళ్ళో ఆడపిల్లల గొడవ నీకెందుకు? నీ చదువు సంగతి నువ్వు చూసుకో. ఇతర్ల గొడవల్లో తలదూర్చావా... మన మర్యాద కాస్తా పోతుంది" అని నా మీద కత్తిదూసింది.

కోరా ఇది విని అమ్మచేతిని గట్టిగా నొక్కుతూ "లూడ్విగ్‌ని అలా కసరడం బాగాలేదు. మా వంటి ఆడపిల్లలు వాడికి నచ్చలేదు" అని అమ్మను ఏదోవిధంగా శాంతింపచేసింది. అమ్మ నాకేసి చూచి ఫక్కున నవ్వింది. అక్కయ్య ఈ ఛలోక్తిని అర్థంచేసుకుంది. తనూ నవ్వింది. అంతటితో ఆ ఘట్టం ఆ రోజుకి ముగిసింది.

భోజనాలు అయ్యాక నేనీ సంగతి మళ్ళీ ప్రస్తావించలేదు. ఆ ముచ్చటలూ ఈ ముచ్చటలూ చెప్పుకుంటూ కాలక్షేపంచేశాము.

పడుకోడానికి లేచాను. నేనలా లేవడం కోరా చూసి తన దగ్గరకు రమ్మని సంజ్ఞచేసింది. నేను దానిదగ్గరకు వెళ్లాక "నువ్వు నా గదిలోకి రా, ఒక సంగతి చెప్పాలి" అని చెవిలో వూదింది. ఇద్దరమూ ఆమె గదిలోకి వెళ్లాం.

"ఏమిటా సంగతి?" అని అడిగాను.

"నువ్వు ఫ్రాన్సును కలుసుకున్నప్పుడు వాడికి ఒక సలహా యివ్వు. వాడు చూడడానికి అందగాడే. కాని కళ్లద్దాలు పెట్టుకున్నాడా ఇంకా బాగుంటాడు. అప్పుడు వాడూ పెద్దచదువు చదివిన వాడేనని ఆడపిల్లలందరూ భ్రమసి

పోతారు, వాళ్లూ వాళ్ల సోదినంతా ఫ్రాన్సుతో చెప్పుతూంటారు........లేకపోతే ఏ పిల్లా వాణ్ని కన్నెత్తి చూడదు'' అని చెప్పింది....

నేను నా గదిలోకి వెళ్ళిపోయాను అమ్మ వంటగదిలో సామాన్లు సర్దుతోంది. కోరా, అక్కయ్యా హాల్లో కూచుని కబుర్లు చెప్పుకుంటున్నారు. వాళ్లకబుర్లు ఎక్కువగా ఫ్రాన్సునుగురించే। ముక్కుద్దాలసంగతీ వారి సంభాషణలో ఎన్నోసార్లు వచ్చింది. వాళ్లు నేను నిద్రపోతున్నా ననుకున్నారు. అంచేతనే అంత బిగ్గరగా వాణ్నిగురించి చెప్పుకోగల్గారు. నేను అదంతా వింటూనే వున్నాను.

మరునాడు సాయంకాలం ఫ్రాన్స్‌ను తోటలో కలుసుకున్నాను. వాడు నన్ను చూడగానే కోరా తన సంగతి ఏమైనా ప్రస్తావించిందా అని అడిగాడు. నేను తలవూపాను.

"కోరా ఏమన్నది? జరిగిందంతా చెప్పు'' అని నన్ను ప్రాధేయపడుకున్నాడు. ఆ రాత్రి జరిగిన సంభాషణ అంతా పూసగుచ్చినట్లు చెప్పేశాను. అమ్మవాదం, ఆ వాదాన్ని కోరా సమర్థించడం ఫ్రాన్సుకు నచ్చిందికాదు. అయితేనేం కోరా తనకు ప్రత్యేకంగా పంపిన సందేశాన్ని విన్నాక ఆ గొడవంతా మరచిపోయి ఎక్కడలేని వుత్సాహంచూపాడు. "కోరా చెప్పింది నిజమే. కళ్ళద్దాలు పెట్టుకుంటే ప్రతిమనిషికి కొత్తకళ వస్తుంది. నేను రేపటినుంచే ఆమె సలహాని శిరసావహిస్తాను. కోరా అప్పుడు నన్ను చూచి.......'' అని ఏదో చెప్పబోయాడు. తరువాత ఏమనుకున్నాడో, పాపం! కరిగి ఆలోచనాసముద్రంలో పడిపోయాడు. కొంతసేపటివరకు మాట్లాడలేదు.

ఆ తత్వం నాకు నచ్చిందికాదు. కోరా పరాయిపిల్ల. పట్నవాసపు అమ్మాయి. ఆ అమ్మాయిని గురించి యింత బాధపడడం ఎందుకు? ఫ్రాన్సు మాత్రమేకాదు. వోస్కరు, బడిపంతులు కోరాను చూచినప్పుడల్లా ఇదే తంతు! ఫ్రాన్సుకి ఈలోకంసంగతి తెలియదు. తను కోరాని ప్రేమించానని భ్రమపడ్డాడు. ఈ భ్రమలోనుంచి వాణ్ణి గట్టెక్కించాలి. ఆ సంగతి వీడు అర్థంచేసు

కోవాలి. అంచేతనే వాడికేసి జాలిగా చూస్తూ "నువ్వే కాదు. కోరానిచూస్తే వూళ్ళో వాళ్ళంతా దానితో మాట్లాడాలని ఉవ్విళ్ళూరుతూవుంటారు." అన్నాడు మెల్లిగా.

నేనన్నది విని ఫ్రాన్సు అదరిపోతూ— "కోరాని చూసి మురిసిపోయేవాళ్లు ఇంకా వున్నారా?" అని బుంగముఖంతో అడిగాడు.

"ఆ! వున్నారు. పంతులు దాన్నిచూస్తే పల్కరించకుండా వూరుకోడు. తను చేస్తున్నపనే మర్చిపోతాడు. ఇక వోస్కర్, వాళ్ళషాపులో పని చేస్తున్న మరో అబ్బాయి నన్ను బతిమాలిస్తా రనుకున్నావా! వాళ్ళ షాపుకు వెళ్ళానా, కోరాని గురించి ఏమేమిటో అడుగుతారు. అంతేనా! కోరా తమ షాపుకు రాదేమని వాళ్ళు అడిగే ప్రశ్నలకు అంతువుందా? 'ఆ సంగతి నా కేం తెలుసు' అన్నానా. నిరాశతో టిక్కముఖం వేస్తారు. ఆ గొడవంతా వాళ్ళ కెందుకో?" అన్నాను.

దాంతో ఈర్ష్య పొంగి పొరలి, ఫ్రాన్సు వాళ్లందరినీ తిట్టిపోశాడు. తనే ఆ అమ్మాయిని ప్రేమించానని వాడి భ్రమ. వీళ్ళందరూ ఎందుకలా ఎగబడడం? వాళ్ళంతా చదువుకున్నవాళ్లు. వాళ్లముందర తను నిలుస్తానా అనే నిరుత్సాహం....తిట్టడం ముగించి, ఒక్కపెట్టున ఏడ్వ నారంభించాడు. నేను చూడలేకపోయాను. ఈ దీనావస్థలో ఫ్రాన్సుకి సహాయం చేయాలి. ఏం జవాబిస్తే వాడు కుదుటబడతాడా అని ఆలోచించాను. ఒక మంచి ఆలోచన మెరుపుకిమల్లె తట్టింది.

"ఫ్రాన్స్! ఇలా దిగులుపడుతూవుంటే నీ కోరిక ఫలిస్తుందా? .... కోరా సలహా ఇచ్చిందికదూ! రేపే కళ్ళద్దాలు కొను. వాటిని చూసిందా సంతోషిస్తుంది. నిన్ను పల్కరించి, నీతో మాట్లాడుతుంది" అన్నాను.

ఆ మాటతో వాడు దోవకువచ్చాడు. "అలాచేస్తే కోరా సంతోషిస్తుందా? లేక తమాషాకు అలా అన్నదా?......" అంటూ మా తోటలోకి చూశాడు. కోరా అప్పుడు తోటలోనే వుంది. అక్కయ్యతో మాట్లాడుతోంది. అది మాకేసి చూస్తోంది. ఆ దృశ్యం చూచి ఫ్రాన్సు ఈలోకంలో వుండేకదూ!

"నిజం చెప్పు? కళ్లద్దాలు పెట్టుకుంటే కోరా సంతోషిస్తుందా?" అని మరొకసారి ప్రశ్నించాడు.

"నే నెలా చెప్పగలుగుతాను? కోరా యిచ్చిన సలహా ప్రకారం ఆ పని చెయ్యి" అన్నాను.

"ఆ! కోరా తప్పక సంతోషిస్తుంది. ఆ పిల్ల పరిహాసంచేయడానికి అలా సలహా యివ్వలేదు. ఆ సంగతి నాకు బాగా తెలుసు. వాళ్ళందరూ చదువుకున్నారే కాని, వాళ్ల మొహాలు చూస్తే అసహ్యం అందరూ శుద్ధమొద్దులు. వాళ్ళని చావదన్నాలి......" అంటూ తనలో రెచ్చిపోతూవున్న ఈర్ష్యని ఒక్కపెట్టున నొక్కివేశాడు.

ధోరణి ఇలా మారడంతో నాకు భయంవేసింది. వాడి బుర్రలో ఇలాంటి భావాలు రేగిపోతూంటే ఏపనినైనా చేయడానికి తొణికేవాడు కాడు. అంచేత నయానోభయానో వాణ్ని ఆ పెడతోవనుంచి తప్పించాలనుకున్నాను.

"వాళ్లు ఏం చేశారని—నీకు వాళ్లమీద కోపం?"

"ఎందుకా? నేను కోరాని ప్రేమించాను. వాళ్లు నా దోవకి అడ్డు వస్తుంటే వూరుకుంటానా?" అన్నాడు.

"ఎవరూ అడ్డురారు. వాళ్లసంగతి మరచిపోవడం మంచిది"

"నువ్వలా అంటే నీ మాటకి ఎదురుచెప్తానా?" అంటూ మందహాసంచేశాడు. గండం తప్పిపోయిందని నేను సంతోషించాను.

తన కేదో పని వున్నదని చెప్పి ఫ్రాన్సు గబగబ ఇంట్లోకివెళ్ళాడు.

అక్కయ్య ఆరోజున భోజనాలసమయంలో నేను లోపలికి ఈలలు వేస్తూ రావడంచూసి "నీ వాలకం చూస్తుంటే ఏదో పెద్దప్లాను వేసినట్లుందే?" అని పరిహాసంగా అంది.

"ప్లానేమీ లేదుగాని, ఏమిటి అలా అడిగావు?" అని అడిగాను.

అది ఏమీ జవాబిచ్చింది కాదు. అక్కయ్యబుర్రలో అప్పుడే ఆలోచన లున్నాయో నాకు తెలియదా?

"నువ్వూ, నీలాంటి ఆడపిల్లలూ ఏం ప్లాన్లు వేస్తుంటారో నాకు తెలియదనుకున్నావా?...... మీరంతా మగవాళ్ళని ప్రేమిస్తున్నామని వూరికే చెబుతూంటారు. పాపం! ఆ అమాయకులు మిమ్మల్ని నమ్మి గోతుల్లో పడుతూ వుంటారు" అని దాన్ని కవ్వించాను.

అమ్మ విని నన్ను వురిమిచూచింది. "వీడికెందుకో యీ గొడవలు? వీడివయస్సుకి ఇలాంటి పెద్ద ఆలోచనలు తప్పుకదూ" అంది అక్కయ్యా కోరాలతో.

కోరా అమ్మని శాంతింపచేస్తూ "వాణ్ణి అలా అదమాయించడం ఎందుకు? లూడ్విగ్‌కి ఆడపిల్లలంటే సరిపడదు. వాళ్ళని హేళనచేస్తాడు. వీడిని దారికి తీసుకుని రావాలి. అందుకు నేనున్నానుకదూ!..."అంది.

ఆ మాట విని అక్కయ్య నవ్వింది. నేనూ ఫక్కున నవ్వాను. అంతటితో అమ్మ శాంతించింది.

"కోరా! నువ్వు లూడ్విగ్ విషయంలో కొంచెం జాగ్రతగా వుండాలి సుమా!—వాడు కాలాంతకుడు" అని ఏమో చెప్పబోయింది.

"లూడ్విగ్ మంచి కుర్రవాడు. వాడికేం తెలుసు మన లోతుపాతులు? వాణ్ని దిద్దడానికి నేనున్నానుకదూ! మా దేశంలో మగవాళ్ళని చూశాను. స్త్రీలు వాళ్ళని అదుపాజ్ఞల్లో వుంచడంలో సిద్ధహస్తులు" అంటూ పకాలున నవ్వింది.

కోరా అలా అన్నందుకు నాకు రోషమొచ్చింది. గట్టి జవాబిచ్చి కోరాని ఏడిపించాలనుకున్నాను. కాని ఇంతలో బయట ఏదో సందడి. ఎవరో పండుగ పాటలు పాడుతున్నారు. ఇవ్వాళ పండుగ కాదే! ఎందుకలా పాడడం?............

కిటికీ తెరచి చూశాం. మా ఇంటి ముందు ముగ్గురు వ్యక్తులునుంచున్నారు. వాళ్లలో రోస్కర్నీ, బడిపంతుల్నీ గుర్తుపట్టాను. మూడోమనిషి ఎవరై వుంటాడు? ఆ ముస్తాబులో వాణ్ని గుర్తుపట్టలేకపోయాను. ఒకడు

పాడుతూంటే మిగతా ఇద్దరూ దాన్నే కలిసి పాడుతూ నృత్యం చేస్తున్నారు. మమ్మ చూసి......

"అందకత్తెవు
మా అదృష్టం నీ అందాన్ని చూడడం
స్వర్గాన్నుంచి వచ్చావు
ఈ అందచందాల్తో,
ఎలా వర్ణించాలి.
నీ అందచందాన్ని,......."

అని పాడుతూంటే కోరా "హాయ్ హాయ్" అంది. అమ్మా అలాగే అన్నది. ఇక అక్కడి ఆనందాన్ని ఏం చెప్పను.

వాళ్లు కోరాని అభినందించడానికి వచ్చారు. అలా పాడుతూ నాట్యం చేస్తున్నారు. కోరా ఆ దృశ్యం చూసి మురిసిపోతూ—

"రేపే ఈ వూళ్ళోవాళ్లందరూ నన్ను ఎలా గౌరవిస్తున్నారో నాన్నకి వివరంగా రాయాలి. నాన్న అది చదివి సంతోషిస్తాడు. రాజకన్యకల కిచ్చే గౌరవాన్నే నాకు ఈ వూళ్ళోవాళ్లు ఇస్తున్నారు" అని అమ్మతో అంటూ చిరునవ్వు నవ్వింది.

పాట పూర్తిచేసి వాళ్లు మావంక చూశారు. కోరా అమ్మతో అన్న మాటల్ని వాళ్లు వినే వుండాలి. కోరాని అభినందించి వాళ్లు వెళ్ళిపోయారు.

వాళ్లు వెళ్ళిపోయాక "లూశ్వేగ్! వాళ్ళని చూసి నువ్వు నేర్చుకోవాలి. స్త్రీలంటే ఎంత గౌరవం, ఎంత మర్యాద ఈ వూళ్ళోవాళ్లకి!" అంది అమ్మ.

మరునాడు మామూలుగా ఫ్రాన్సిస్‌ని కలుసుకున్నప్పుడు ఆ రాత్రి జరిగిన సంఘటనను గురించి వాడితో చెప్పాను. వాడు విని నిట్టూరుస్తూ తల దించుకున్నాడు. ఏదో అనబోయాడు కాని, పెదవులు కదిలితేకదూ! వాడి వీపు తట్టి "యిలా దిగులుపడడం బాగాలే" దన్నాను. వాడు మందహాసం చేస్తూ—

"వాళ్లెందుకు రావాలి? ఆ పాటలతో కోరాను ఎందుకు ఆందోళన పరచాలి." అన్నాడు మెల్లిగా. మళ్ళీ వుద్రేకంతో "వాళ్ల పాటా, ఆ చిందులూ నేనూ కంచెదగ్గరవుండి విన్నాను. రాత్రి నిద్రేలేదు" అని తను పడ్డ బాధనంతా చెప్పేశాడు.

"నువ్వు ఇలా ఖంగారుపడుతూంటే కోరా బాధపడుతుంది. ఆ సంగతి మర్చిపోదూ" అని వాణ్ని సమాధానపర్చడానికి శాయశక్తులా ప్రయత్నించాను. వాడు నా మాట వింటేకదూ!

"కోరాని వాళ్ళు ఇలా వేధించడం ఎందుకు చెప్పు? వాళ్ళు చదువుకున్నవాళ్లు కూడాను. నాకు అంత చదువురాదనే కోరా నన్ను చిన్నచూపు చూస్తోంది" అని కంట నీరుపెట్టాడు.



ఇంతలో నన్ను ఇంట్లోనుంచి పిలిచారు. అది కోరా గొంతే. ఆ కంఠాన్ని ఫ్రాన్సు గుర్తించాడు.......కోరా నాకోసం ఇంట్లోనుంచి తోటలోకి వస్తూంది. అప్పటికే చీకటి పడుతోంది. ఆ చీకట్లో కోరా నన్ను చూడడం

కష్టం.........ఆమెను చూచి "ఇక్కడినుంచి కదలకు. జవాబీయకు" అని ఫ్రాన్సు నన్ను బ్రతిమాలాడు. వాడు అలా ప్రాధేయపడడానికి కారణం ఏమిటా అని ఆలోచించాను. ఎప్పటిలాగా ఇవ్వాళ వాడు ముస్తాబుచేసుకోలేదు. కోరా అక్కడికి వచ్చి తన్ను ఆ ఫ్యాక్టరీదుస్తుల్లో చూసిందా, కొంపమునిగి నట్టే! మనిషి కుంచుకుపోతున్నాడు.

నన్ను పిలవడానికి కోరా మా వైపుకే వచ్చింది. అన్ని వైపులా పారచూసింది. మేము అక్కడే కదలకుండా వున్నాం. అక్కడ నేను లేనను కొన్నది కాబోలు, కోరా ఇంట్లోకి వెళ్ళి పోయింది.

ఫ్రాన్సు దృష్టి అంతా కోరామీదే! ఆ రోజున తెల్లదుస్తులు వేసుకుంది. ఎంత చక్కని కంఠం! ఆ నడకలో ఎంత గాంభీర్యం, ఎంత వయ్యారం! ఫ్రాన్సు తన్మయుడై పోయాడనుకోండి! ఎంత మురిసిపోయాడు! వాడి చీక టంతా ఆ సౌందర్యంలో మాయమైపోయింది. చంద్రోదయమయింది. వెన్నెల కన్నులపండువుగా కాస్తున్నది........

ఆ ఆనందసముద్రంలో వాడు ఎంతసేపు మునిగితేలుతూవున్నాడో!

ఆ తన్మయావస్థలో వాడి కెన్నెన్ని ఆలోచనలు కలిగాయో! కోరాదర్శనంతో తన జన్మ పావనమై పోయిందనుకొనివుండాలి. తనకూ కోరాకీ మధ్య అడ్డుగావున్న ఈ కంచెలూ, ఈ చెట్లూ.....అన్నీ అమాంతంగా అదృశ్యమైపోయాయనే వాడు తలచివుండాలి!



# పండుగ ఉత్సవము

మా ఎండాకాలపు సెలవులు ఆగష్టునెలలో ప్రారంభమవుతాయి. ఆగష్టు మాసంలో మూడోఆదివారం మాకు పర్వదినం. పూర్వ సాంప్రదాయాలు నిలబెట్టడానికి ఈ పండుగను మావూరుకు సమీపాన్నేవున్న కొండమీద బ్రహ్మాండంగా జరుపుకుంటాం. అన్ని ప్రాంతాలనుంచీ ఈ పర్వదినోత్సవంలో పాల్గొనడానికి జనం తండోపతండాలుగా వస్తూవుంటారు. ఈ వుత్సవానికి సంబంధించిన ఏర్పాటంతా చూచే బాధ్యత మా గ్రామపెద్దలదే. మా గ్రామ పెద్ద, ఓస్కార్, బడిపంతులూ ఆ ఏర్పాట్లన్నీ చేశారు. ఆహ్వానపత్రికలను అచ్చు వేయించి, అన్ని ప్రాంతాలవారికీ వాళ్ళే పంపారు.

ఒక రోజున మావూరి వాళ్ళే ఆహ్వానపత్రికను తెచ్చిచ్చారు. వాళ్లు మా యింటికి వచ్చేటప్పటికి మేము ఇంట్లోనే వున్నాము. మా అమ్మ వాళ్ళని మర్యాదచేసి లోపలికి తీసుకొచ్చింది. అతిథులు హాల్లో సోఫామీద కూచున్నారు. "మా బంధువు—బొంబాయిలో వాళ్ల అమ్మా నాన్నలతో వుంటూన్నది. కోరా సెలవులు గడపడానికి ఇండియా దేశాన్నుంచి యీమధ్యనే వచ్చింది. అని కోరాను వాళ్లకు పరిచయంచేశాము. అమ్మ అందరికీ కాఫీ ఇచ్చి సత్కరించింది.

"మీ రందరూ ఈ వుత్సవంలో పాల్గొనడానికి తప్పకుండా రావాలి" అన్నాడు ఓస్కార్. పంతులు పండుగకు చేయబడుతూవున్న సన్నాహాలు వివరించి చెబుతూ "ఎన్నిపనులున్నా మీరు ఉత్సవం చూడటానికి వచ్చితీరా" లని చెప్పాడు.

"పండుగ జరిగేది మనవూరి కొండమీదేగా! తప్పకుండావస్తాము" అంది అమ్మ చిరునవ్వు నవ్వుతూ.

"ఈ సంవత్సరం నాట్యంచేయడానికి ఏర్పాట్లు చేశారా?" అని అక్కయ్య అడిగింది.

అందుకు తగిన ఏర్పాట్లు చేస్తున్నామని ఓస్కారు జవాబిచ్చాడు. ఇంక అక్కయ్య సంతోషానికి మేరలేదు! కేరింతలుకొట్టింది. తనూ, కోరా తప్పకుండా వస్తామనీ, నాట్యంలో పాల్గొంటామనీ గంతులు వేసింది. అమ్మ ఎంతో సంతోషపడ్డది. మా కోరాని వాళ్లకు పరిచయంచేస్తూ 'యీ పిల్ల కూడా వుత్సవంలో పాల్గొంటుం' దని చెప్పింది. వాళ్ళూ అందుకు ఆనందించారు. ఆ మాటా ఈ మాటా చెబుతూ కొంతసేపు వుండి, సెలవు పుచ్చుకొని వాళ్ళు వెళ్ళిపోయారు.

నా మిత్రుడు ఫ్రాన్సు కోరాతో పరిచయంచేసుకోవాలని తహతహ లాడుతున్నాడు. కోరా పట్నవాసపు పిల్ల. తనో? పల్లెటూరివాడు. ఆ పిల్ల చదివి నంత చదువు తను చదవలేదు. అంచేత కోరాను పలకరించడానికే భీతిపడే వాడు. మాకు ఆహ్వానపత్రిక వచ్చిననాటి సాయంకాలమే ఫ్రాన్సును కలుసు కొన్నాను. ఉత్సవంసంగతి వాడికి చెప్పి. వాడూ మాతో కొండమీదికి రావా లని చెప్పాను. తనకు ఆహ్వానం రాలేదే.......అని ముందు కొంచెం సంకో చించాడు. కోరా మాతోపాటు పండుగవుత్సవంలో పాల్గొనడానికి వస్తుందని మందహాసంచేస్తూ అన్నాను. దాంతో అన్ని సంకోచాలూ మాయమైపోయాయి. తనూ తప్పక మాతో వస్తానని ముసి ముసి నవ్వు నవ్వుతూ జవాబిచ్చాడు....

పండుగరోజు రానే వచ్చింది. మధ్యాహ్నం భోజనాలయ్యాక వుత్సవంలో పాల్గొనడానికి అందరమూ బయలుదేరాం.

కొండ చాలా దూరం. కొన్ని మైళ్ళదూరం నడవాలి. దారి అడవి మయం. సెలయేళ్లు దాటాలి......

గ్రామపెద్దలందరూ వూరేగింపుతో బయలుదేరారు. మేళతాళాల సంగతి చెప్పాలా! అనేకరకాల వాయిద్యాలు వాయిస్తూ వూదుతూ వాద్యగాళ్ళు ముందు నడిచారు. వాళ్ల వెనక మా వూరి పెద్దవర్తకుడు జండా పట్టుకొని నడిచాడు. ఆయన వెనక మా వూరిపెద్దలు కొందరు నడిచారు. మరికొంత మంది బండ్లలో ప్రయాణమయ్యారు. తమ బండిలోకి రమ్మని వకీలుభార్య మా

అమ్మని ఆహ్వానించింది. అక్కయ్యా, కోరా వాళ్ళవయస్సు పిల్లలవెంట నడిచారు. ఫ్రాన్స్ నాతోనే నడిచాడు. ఓస్కరూ, బడిపంతులూ, వాద్యగాం డ్రతో నడుస్తున్నారు.

పండుగకోసం ఆనాడే పట్నంనుంచి మా పేపీ మామయ్యా, తెరీస్ అత్తయ్యా, రోసా వచ్చారు. వాళ్లు కాలినడకనే జనంతో వస్తున్నారు. మా అమ్మ వకీలుగారిబండిలో ప్రయాణంచేయడం అత్తయ్యా చూసింది. "అవును! వాళ్ళంతా వుద్యోగులు, వుద్యోగస్తుల భార్యలు. నువ్వు ఎంత చదువు కొన్నా, వాళ్లు వుద్యోగం యిస్తామన్నా భీష్మించుకు కూచున్నావ్, అంచేత మన కా అదృష్టం ఈ జన్మలో లభిస్తుందా?" అని మామయ్యకేసి వురిమి చూస్తూ గొణుక్కుంది. మావయ్యను చెడామడా తిట్టింది. మావయ్య ఎంత చదువు చదువుకున్నా వుద్యోగం చేయడానికి ఇష్టపడలేదు. పెద్దలు ఆర్జించిన ఆస్తి పాస్తులు చూసుకొంటూ స్వేచ్ఛాజీవితం గడపాలని ఆయన వాంఛ. ఇతరులు అలా వుద్యోగలాంఛనాల్లో వుండడం అత్తయ్యకి ససేమిరా గిట్టేది కాదు. వాళ్లభార్యలందరూ అలా బండ్లమీద వెళ్తుంటే, తను కాలినడకను పోవడం తనమర్యాదకు లోపమని గొడవచేస్తోంది. ఆయ నేం చేస్తాడు పాపం! అత్తయ్యచేసే రాద్ధాంతానికి వోర్చుకోవాలి. ఇక రోసా పడేబాధ చెప్పలేం. "అమ్మా! వూరుకోవే. ఎవరైనా వింటే నవ్వుతారే" అంది మెల్లిగా తల్లితో. అత్తయ్య దానిమాట వింటేకదూ? "నువ్వు నాతో రావడానికి యిష్టం లేకపోతే ఆ పిల్లలవెంట పో" అని కసురుకున్నది. రోసా మెదలకుండా ఆడపిల్లల జతకు వెళ్ళిపోయింది.

వూరేగింపు కొంతదూరం సాగింది. ఓస్కర్ వూరేగింపులో తా నుండవలసిన చోట వుంటాడా? కొంతసేపు కోరావున్నముఠాతో నడుస్తాడు. వాళ్ళకు కబుర్లుచెబుతూ నవ్విస్తాడు. అంతలో అమ్మవున్న బండిముందుకు వస్తాడు. అక్కడనుంచి మళ్ళీ ఆ ఆడపిల్లలగుంపులోకి చేరుకుంటాడు. అత్త య్యకి వోస్కర్ ప్రవర్తన ఏం బాగుండలేదు. రోసాతో ఎకసక్కాలాడడం

చూసి చిరెర్తిపోయింది. రోసాను పిలిచి "పరాయివాళ్లతో అలా గంతులు వేస్తావేమే? చూచినవాళ్లు ఏమనుకుంటారు?" అని గద్దించింది. రోసా భయ స్థురాలు, వాణ్ని ఎకసక్కాలు మానమని గట్టిగా మందలించుతూ నన్ను చూసి గమ్మున వూరుకుంది. నా సంగతి దానికి తెలుసు. దాని పిరికితనం బయట పెట్టి ఏడిపిస్తానని జంకింది.



పర్వదినోత్సవసభ నాలుగు గంటలకు జరగాలి. అప్పుడే రెండు గంటలు అయింది. వూరేగింపు యింకా మా వూరి ప్రక్కనే వుంది. ఎండ తీక్షణంగా వుంది. దాన్ని భరించలేక అందరూ ఆవటిల్లిపోయారు. ఒకటే అరుపులు, కేకలు! తొందరగా నడిస్తేనా! ఎందుకో ఈ ఆలస్యం చేయడం?

ఈ ఆలస్యానికి కారణం తెలిసింది. మావూరి మేయరుగారి ముస్తాబు పూర్తికాలేదు. ఆయనకు మించినవాడే మునసబూను. వాళ్ళకోసమే ఈ ఆల స్యమంతా! ...... అమ్మయ్య! ఎలాగైతేఏం గబగబ వచ్చి, వూరేగింపులో కలిశారు. ఇంకెందుకు జాగు? చప్పున నడవాలని ఆజ్ఞాపించారు. మేళాలవారు

వాయిద్యాలు వాయించారు; బాకాలు వూదారు. అలసిపోయివున్నవాళ్ళ కందరికి ఆ మేళాలతో ఎక్కడలేని శక్తివచ్చింది. పొలిమేర దాటి అడవిమార్గం పట్టాము.
వీళ్ళందరికన్నా ముందే గమ్యస్థానానికి చేరుకోవాలని ఫ్రాన్సు నేనూ చకచకా నడిచాం. ఆడపిల్లలూ మా వెంట పరుగె త్తనారంభించారు. కోరా నన్ను చూసి మందహాసంచేసింది. తనకేసి చూసి కోరా మందహాసం చెయ్యలేదని ఫ్రాన్సు చిన్నపుచ్చుకున్నాడు. "అది ఆడపిల్లల నైజం. దాన్ని మార్చడం ఎవరి వశం? ఈమాత్రానికే నువ్విలా విక్కముఖంవేయడం మంచిది కాదు" అన్నాను ఫ్రాన్సుతో. వాడు వింటేనా? నాతో మాట్లాడదే!

ఎలాగయితేనేం శ్రమపడి గమ్యస్థానానికి చేరుకున్నాం. వచ్చే జనమంతా కూచోడానికి ఆ స్థలం బాగుచేశారు. బల్లలూ, కుర్చీలూ వలయాకారంలో అమర్చారు. మధ్య జెండాప్రతిష్ఠాపనకు పొడుగాటి స్తంభం వుంది. దాన్ని రంగుకాగితాలతో, పూలదండల్తో చక్కగా అలంకరించారు. సాయంత్రం విద్యుద్దీపాలు వెలిగించడానికి కావలసిన ఏర్పాట్లు చేశారు. ఆ ఏర్పాట్లు చూశాం. అంతా నిశ్శబ్దం. చుట్టూ అడవి ఎంతో ఆహ్లాదకరంగా వుంది. బల్లలమీద సంతర్పణకోసం అమర్చబడ్డ పళ్ళూ, రొట్టెలూ, పానీయాలు చూశాం. ఈ పండుగరోజున అందరూ కడుపునిండా తినడానికి ఎన్నోరకాల భోజనపదార్థాలు సిద్ధంచేసి వుంచారు. వీటికోసం ఎంతడబ్బు ఖర్చుపెట్టారో! ఇది పర్వదినం. ప్రశాంతంగా జరుపుకోవాల్సినదానికి ఇంత ఆర్భాటం ఎందుకని ఫ్రాన్సుతో అన్నాను. వాడికి ఇదేం నచ్చలేదు. ఆ జనంలోనుంచి ఎలాగైనా బయటపడి ఏకాంతంగా ఒక మూల కూచుని ఆనందించాలని వాడికోరిక. ఇంక కొద్దినిమిషాల్లో ఆ జనమంతా ఇక్కడికి వచ్చేస్తుంది. ఈ రద్దీలో వాడికోరిక నెరవేరుతుందా? వాణ్ణి చూస్తే జాలేస్తుంది?

కొంత సేపటికి అందరూ ఇక్కడికి చేరుకున్నారు. చెట్ల నీడమూలంగా ఎండ తీవ్రత అంతగా లేదు. చల్లగాలి వీస్తోంది. దాంతో అందరూ తేరుకున్నారు. అక్కడికి రాగానే అందరి దృష్టి ఆ బల్లలమీది ఆహారపదార్థాలమీదే,

అందరూ కూచోవచ్చని బాకాలు వూదగానే బల్లలదగ్గరకు చేరి కూచున్నారు. ఒక్క వోస్కరూ, బదిపంతులే అందరికీ పానీయాలు అందించసాగారు. అరగడమే తరువాయి, కోరిన పానీయాలు విధీ--విరామం లేకుండా పంచి పెట్టారు.

భోజనాలు పూర్తిఅయ్యాక సభ పా్రరంభమైంది. జండా ఎగిరింది. మేయరూ, మునసబూ పండుగల |పాముఖ్యతను గురించి గంభీరోపన్యాసా లిచ్చారు. ఇలాంటి వుపన్యాసాలంటే మా వాళ్ళు వుబ్బితబ్బిబ్బయిపోతారు. అక్కడికి వచ్చినవాళ్ళలో చాలమంది రైతులు, రైతులువద్ద పనిపాటులు చేసు కొనే కార్మికులూ, రాత్రింబగళ్లు తమ పనుల్లో నిమగ్నులై వుండేవాళ్లు. ఇలాంటి గంభీరోపన్యాసాలు వినడానికి ఇదే అవకాశం వుపన్యాసాలు పూర్తి అయ్యాక ఆనందంతో అందరూ కరతాళధ్వనులు చేశారు

కోరా, అక్కయ్యా, అమ్మా, |ఫాన్సు, నేనూ కూచున్న బెంచీదగ్గరే వోస్కరు ప్రత్యక్షమయ్యాడు. ఈ వుత్సవం ఇంత జయప్రదంగా జరగడానికి తనే కారణభూతుణ్ణనీ, తన కృషివల్లనే భోజన సదుపాయాలు ఇంత చక్కగా కొనసాగాయనీ కోతలుకోయసాగాడు. మా ఎదుటి బల్లమీదే అత్తయ్యా, మావయ్యా, వాళ్ళ రోసా కూచునివున్నారు. వాళ్లు వీకికోతలు ఆలకిస్తు న్నారు. అలా వోస్కరు మా దగ్గిరే వుండిపోవడమూ, ఇలా తన గొప్పతనం చెప్పుకుంటూ ఎగిరిపడడం వాళ్ళకు నచ్చిందికాదు. రోసాని వోస్కరు పెళ్ళి చేసుకోదలచాడని మాకు తెలుసు. వాడీ సమయంలో వాళ్ళదగ్గర వుండవల సినవాడు! ఈ ఆనందంలో రోసానే పూర్తిగా మరచిపోయాడు. అప్పుడు వాళ్ల ముఖాలు చూసితీరాలి!......

"ఇలాటి కొండల్లో, ఈ అడవిప్రదేశాల్లో ఎంతో |ప్రశాంతంగా వుంటుంది. ఇట్టి అవకాశం ఎల్లప్పుడూ లభిస్తుందా? అమ్మయ్య! సంతర్పణ అయిపోయింది. ఈ సభకూడా ముగిసింది ఇక నాట్యం ఆరంభమవడానికి కొంత ఆలస్యముంటుంది. ఈలోగా మనం ఆ అడవిలోకి వెళ్ళొద్దాం రండి.

అక్కడ ఎంతో బాగుంటుంది. నాకు కవిత్వం వచ్చు. అక్కడ ప్రశాంతంగా కూర్చుని చక్కగా పద్యాలు అల్లవచ్చు'' అని కోరాతో అన్నాడు వోస్కార్. కోరా వోస్కార్ మాటలకు ఫక్కున నవ్వింది. ఆమె నవ్వడంతో వోస్కారు మండిపోయాడు. ఈ నవ్వుతో కోరా తన్ను హేళనచేస్తోం దనుకున్నాడు కాబోలు పాపం!

"ఈ అడవిని చూసే ఇలా చిందులుతొక్కుతున్నావే, మాదేశం లోని అడవుల్ని కొండల్ని చూస్తే ఇంకేం చేస్తావో!'' అని కోరా వాణ్ణి రెచ్చగొట్టింది. కోరా తనతో మాట్లాడింది, అదేచాలు తన జన్మ పావనమైపోయిం దని పొంగిపోయాడు. చప్పట్లు కొడుతూ గంతులు వేశాడు.

"అవును కోరా! మీదేశంసంగతి నాకు బాగాతెలుసు. మీ దేశంలోని అడవులకూ, కొండలకూ,— అంతేనా— ఆ నదులకు, మా దేశంవాటికి పోటికేమిటిలే! ఆ దేశపు ప్రకృతిసౌందర్యాన్ని గురించి వింటే ఈలోకాన్నే పూర్తిగా మర్చిపోవాలి. అక్కడి చెట్లు ఎంతో మనోహరంగా వుంటాయి. ఇక వాటిమీద వాలే పక్షులసంగతి వింటేనా?'' అంటూ తను హిందూదేశాన్ని గురించి పుస్తకాల్లో చదివిన పాతపాఠాల్ని వల్లెవేశాడు.

కోరా వుడుకుబోతు పిల్ల వాడి మాటలు వింటూ, చిరునవ్వు నవ్వింది. "అంతేనా? ఆ చెట్లలో హాయిగా వుయ్యాల వూగవచ్చు. దాంతో కవితాధోరణి వూటజలంలాగా అమాంతంగా కట్టలు తెంచుకొస్తుంది." అంది.

"అదే నాకు కావాల్సింది మీ దేశానికి ఒకసారి రావాలి. దాంతో నా జన్మ పావనమవుతుంది'' అన్నాడు హుషారుగా వోస్కార్.

సూర్యాస్తమయమై చీకటిపడుతూంది. దీపాలు వెలిగించారు. బూరలు వూదారు. భేరీలు మ్రోగాయి. ఇంకెవ్వరూ మాట్లాడకూడదు........

పండుగనాటిరాత్రి కార్యక్రమం ప్రారంభమైంది. పాటలు పాడారు. ఒకరకం పాటలా ఒకలోకమా! విచారాన్ని సూచించే పాటలూ, భక్తిగీతాలూ —ఎన్నో వున్నాయి. అంతా నిశ్శబ్దంగా కూచుని వింటున్నారు. కొందరు

కన్నీరు కార్చుచున్నారు. మరికొందరికి వుద్రేకం హెచ్చిపోతోంది. తలలు వూపుతూ, దరువేస్తూ పరవశులైపోతున్నారు......ఆ పాటలతర్వాత జావళీలు వగైరా పాడనారంభించారు. వాటిలో ప్రాచీనపు ప్రేమగాథలు ఎన్నో వున్నాయి. ఈ కాలపు ప్రేమగీతాలూ వున్నాయి.....

బల్లలు, బెంచీలు, కుర్చీలు వగైరా ఒక మూలకు సర్దేసి, ఆ స్థలాన్నంతా ఖాళీచేశారు. నాట్యం ప్రారంభమయింది. చిన్నా, పెద్దా అనే భేదం లేకుండా అందరూ నాట్యంలో పాల్గొన్నారు. నాట్యానికి అవసరమైన లయతో వాయిద్యాలు సాగాయి. కోరా పట్నవాసపు పిల్ల. అందరికీ ఆ పిల్లతో డ్యాన్సు చెయ్యాలని ఆశ. కోరా బడిపంతులుతో నాట్యంచేస్తే, వోస్కారు ఏడ్చిపోతాడు. వోస్కారుతో డ్యాన్సుచేస్తే, పంతులుకు కష్టం! మరి ఫ్రాన్సు సంగతో! అప్పటి వాడి అయోమయావస్థను ఎవరు అర్థంచేసుకోగలరు? పాపం! వాడికేసి ఎవరైనా చూస్తేనా?

ఇక రోసా సంగతి చెప్పనే అఖ్ఖరలేదు. వోస్కారువైపు వురిమి చూస్తోంది. వాళ్ళఅమ్మ వాణ్ని చెడామడా తిట్టేస్తున్నది. మావయ్యఅవస్థ ఏం చెప్పను! మావయ్యవల్లనే తన కింత అవస్థ వచ్చిందని, అత్తయ్య,—పాపం—ఆయన్ని తెగ తిట్టిపోస్తున్నది. వాళ్ళ అవస్థలు చూస్తుంటే నాకు భయంవేసింది. ఫ్రాన్సు కంగారుపడిపోతున్నాడు.

కోరా చదువుకున్న వాళ్ళతోనే మాట్లాడుతుంది! సరస సల్లాపాలాడుతుంది. తనూ వాళ్ళలాగా చదువుకొంటేనో!...... ఆ బుర్రలో ఏమేమి చెలరేగి పోతున్నాయో నాకేం తెలుసు? కాస్సేపు నాతో మాట్లాడనే లేదు. మౌనం దాల్చాలనుకున్నాడేమో! .......వాళ్ళకేసి చూస్తూ చూస్తూ ఏమనుకున్నాడో! ఫ్రాన్సు నన్ను అడిగాడు. "నువ్వు లాటిన్, గ్రీకు భాషల్ని చదువుతున్నావని విన్నానే. వాటిని చాలా త్వరలో నేర్చుకోడానికి వీలుంటుందా?" వాడి ఈ మాటతో నాకు జాలేసింది. వాడు అడిగింది గడ్డు ప్రశ్న. ఈ చిక్కునుంచి తప్పించుకోవడం ఎలాగా అని కొంచెం ఆలోచించాను.

"ఆ! ఆ! జ్ఞాపకంవచ్చింది. నేను చరిత్ర పుస్తకంలో ఒక విషయాన్ని చదివాను. ఒక వూళ్ళో పెద్ద రైతు దగ్గర కూలివాడు ఒకడు వుండేవాడట. బాల్యంలో చిలిపిపనులయందు వున్న సరదా వాడికి చదువుమీద వుండేదికాదట. వాడికి ఆ పెద్దవయస్సులో చదవాలని బుద్ధిపుట్టింది. కూలినాలిని పూర్తిగా వదిలేసి అహోరాత్రులూ చదవసాగాడు మూడు సంవత్సరాలు అలా దీక్షగా చదివి చదువు పూర్తిచేశాడు" అన్నాను.



"అంత తొందరగా చదువు పూర్తిచేయడానికి వాడెంతో సమర్థుడై వుండాలి. నా వంటి మొద్దులకు అది అంత సులభంగా అబ్బుతుందా?" అని ఆ అమాయకుడు ప్రశ్నించాడు.

"ఆ ప్రశ్నకు నే నేం చెప్పగలను? ఆ పుస్తకంలో ఈ ప్రశ్నకూ జవాబువుంది. ఆ వూరికి ఒక ప్రొఫెసరు వచ్చాడట. కూలివాడి పాండిత్యం చూసి, ఆయన ఆశ్చర్యపడ్డాడట. వాడికి తెలిసినంతకూడా ఆయనకు తెలియదట. వాడి పాండిత్యానికి విస్తుపోయి ఎంతో శ్లాఘించాడట!" అన్నాను.

"అయితే, అతడు రాత్రిళ్లు నిద్రపోకుండా చదివేవాడని ఆ పుస్తకంలో రాశారా?" అని ఫ్రాన్సు ఆలోచనాపరంపరల్లో మునిగితేలుతూ అడిగాడు.

"ఆ! ఆసంగతీ ఆ పుస్తకంలో రాశారు. తన ఇంట్లో దీపంవుండేది కాదు. పశువులపాకలో ఒక లాంతరు వుండేదట. అదీ బాగా వెలిగేదికాదు. దాని ముందు వాడు పాఠాలు వల్లెవేసేవాడని ఆ పుస్తకంలో రాశారు"

"అలా వాడు అంత దీక్షతో చదవడానికి కారణం ఏదో వుండితీరుతుంది.........బహుశా ఏ ఆడపిల్లో వాణ్ని ఆక్షేపించివుంటితీరాలి" అని ఫ్రాన్సు తటపటాయించకుండా అనేశాడు.

"నా కాసంగతి ఏం తెలుసు? పుస్తకంలో అది వ్రాసివుంటేకదూ? కాని ఒక సంగతిమాత్రం వుంది. వాడే కొంతకాలానికి ఆదేశపుమతాచార్యుడయ్యాడట" అని నేనా పుస్తకంలో చదివింది ఫ్రాన్సుకు చెప్పివేశాను.

"ఒక పనిమనిషి అలా కష్టపడి చదివి అంత గొప్పవాడయ్యాడని అన్నావే. నేనూ పట్టుపట్టి చదివితే నాకూ అంత అదృష్టభాగ్యం లభిస్తుందా? ఆ చదువు పూర్తిచేయడానికి వాడికి మూడేండ్లు పట్టితే, ఇక నాకో......చాలా కాలం పట్టుతుంది. ఈలోపునే కోరా తన దేశానికి వెళ్ళిపోతుంది. మరి నా గతేమిటి?" అని పెద్ద నిట్టూర్పు విడిచాడు. కళ్లల్లో నీళ్లతిరిగాయి.

"ఫ్రాన్స్! ఎందుకూ నువ్విలా బాధపడడం? ఇక ఈ విషయం మర్చిపో.—అందరూ ఇండ్లకు బయలేరారు. మనమూ వెళ్ళాలి" అంటూ వాడిని శాయశక్తులా సముదాయించడానికి ప్రయత్నించాను.

వాణ్ని యీ సందిగ్ధావస్థలో చూసేటప్పటికి నాకు ఎంతో జాలివేసింది.

"ఇదిగో చూడు, ఫ్రాన్స్! నువ్వా కథలోని మనిషికన్నా తెలివిగలవాడివి. నువ్వా చదవడానికి పట్టుపట్టు. నేనూ ప్రతిరోజూనీకు సహాయం చేస్తూవుంటాను" అని వాడి భుజాన్ని సానునయంగా తట్టుతూ అన్నాను. దాంతో ఫ్రాన్సు తృప్తిపడి అక్కడి నుంచి అదృశ్యుడయ్యాడు. వాడికోసం ఆ గుంపునంతా కలయచూశాను.

అడవిలోకి మనస్సు కుదటబడడానికి కాబోలు వెళ్ళాడు. ఏ చెట్టు ంతసేపు కూచున్నాడు. ఈలలు వేశాడు....

నేనూ వాడున్న స్థలాన్ని తెలుసుకొని అక్కడికే గబగబనడిచాను. చీకటి, కటిక చీకటి. వాడు నేను దగ్గరకు రావడం తెలుసుకున్నాడు. నాకుఎదురుగా వచ్చి నన్ను పలుకరించాడు. "ఆ పుస్తకాన్ని నాకు ఇవ్వు. వాడి కథను ఒకసారి చదవాలి" అని నా చెవిలో చెప్పాడు. "సరేలే. రేపు ప్రొద్దున్నే ఇస్తాలే" అన్నాను. ఇక వాడు లేచి అక్కడినుంచి చక్కాపోయాడు.

తర్వాత మా అమ్మ నన్ను పిలిచి 'ఫ్రాన్సు ఏడీ' అని అడిగింది. కోరా మావద్దకు వచ్చింది. అదీ 'ఫ్రాన్సు ఎక్కడికి వెళ్ళా' దని అడిగింది. బహుశా వాడు అద్దుదారిని ఇంటిముఖంపట్టివుంటాడన్నాను. అమ్మ నా జవాబు విని ఎంతో విచారపడ్డది. "మనం వాడితో మాట్లాడలేదని వాడు చిన్నబుచ్చుకొని వుంటాడు. ఫ్రాన్సు మంచివాడు...."అని ఫ్రాన్సును శ్లాఘించింది.

ఇంతలో మాకు సమీపాన్నే ఎవరో ఏడుస్తూన్నట్లు వినిపించింది. అందరం అటు వెళ్ళాం. పేపీ మామయ్య కన్పించాడు. ఆ ఏడ్చేది మామయ్యే! ఆయన ముసలివాడు. చంటిపిల్లవాడికిమల్లే ఏడుస్తున్నాడు. మామయ్య అవస్థనుచూసి నేను బేజారయ్యాను. అమ్మ, అక్కయ్యా, కోరా ఆయన్ని చూసి నిశ్చేష్టులయ్యారు. అత్తయ్య మామయ్యప్రక్కనే కూచునివుంది.

మామయ్య ఎందుకలా ఏడుస్తున్నాడని ఆవిడ నడిగాం. మావంక వురిమి చూసి "ఆఁ, మీ మామయ్య తప్పతాగాడు. నే నెంత వద్దనిచెప్పినా నా మాట వినేఘటమా?" అని ఒక్క కేకేసింది. ఇక ఈయన ఇక్కడ వుంటే మా మర్యాదకు భంగమని, ఆయన్ని ఏవిధంగానైనా ఇంటికి తీసుకెళ్ళడమే మంచిదన్నది అమ్మ. మాకు పరిచయస్తులైనవారు మావేపుకు వచ్చారు. వాళ్ళ సహాయంతో మామయ్యను ఇంటికి తీసుకొనివెళ్ళడానికి శతవిధాల ప్రయత్నించాము. ఆయన అక్కడినుంచి కదిలేనా? వూరకే ఏడుస్తాడు. "నే నింక బ్రతకను. ఇక్కడే చచ్చిపోతాను" అని కేకలుపెట్టసాగాడు.

అర్ధరాత్రి అయింది. పండుగ కార్యక్రమం ముగిసింది. అందరూ ఇంటిదారిపట్టారు. మా వెంట వోస్కరూ వచ్చాడు.

ఎలాగయితేనేం, తెల్లవారేటప్పటికి ఇంటికి చేరుకున్నాము. ఓస్కరు మా ఇంట్లోనుంచి కదలడే! వాణ్ని సాగనంపటం బ్రహ్మాతరమైంది. అలా వెళ్తున్నా వాడిచూపులు కోరామీదే!

కిటికీలోనుంచి బయటికి చూసేటప్పటికి ఫ్రాన్సు మతి తప్పిపోయిన వాడికిమల్లే మా ఇంటిముందు నిలబడి వున్నాడు. వాడి దృష్టి మా మీదే! ఏం మాట్లాడడు. అలా ఎంతసేపటినుంచి నిలబడి వున్నాడో!

ఎంతో సంతోషంగా పండుగ వుత్సవానికి బయలుదేరాం! ఆ పండుగ ఫలితం ఇలా తేలింది!

## కోరా వెళ్లిపోయింది!

మా సెలవులు ముగింపుకొచ్చాయి. కొద్దిరోజుల్లో మా స్కూలు తెరుస్తారు. అమ్మని, అక్కయ్యని, ముఖ్యంగా కోరానీ వదిలిపెట్టి తప్పని సరిగా వెళ్ళితీరాలి. కోరా ఇక్కడ వున్నంతకాలం ఏదో సాకుతో వుండాలని నా కోరిక. ఎలా అమ్మతో చెప్పడం? అమ్మ వూరుకుంటుందా? క్రింది క్లాసులో ప్యాసయ్యాను. స్కూలు తెరిచిన రోజునే వెళ్ళి పైకాసులో చేరాలి. అలా అక్కడ వుండకపోతే ప్రిన్సిపాలు మండిపడతాడు. ప్రొఫెసర్లు, తోటి పిల్లలూ కోప్పడుతారు ఇది గట్టిచిక్కే. ఎలా మరి? ఇదే ఈ రోజుల్లో నన్ను కలవరపెడుతున్న సమస్య! ......

ఒకనాడు ప్రొద్దున్నే మామూలుగా కాఫీ పుచ్చుకోడానికి భోజనాల గదిలోకి వెళ్ళాను. అమ్మ నన్ను చూచి "కోరాకి వాళ్ళ నాన్న జాబురాశాడు. ఇప్పుడే వచ్చింది. కోరా ఇక మనల్ని వదలిపెట్టి వాళ్ళదేశం వెళ్ళాలి. వాళ్ళ స్నేహితురాలు లండను నుంచి బొంబాయికి వారంరోజుల్లో ప్రయాణమవుతుం దట. అక్కడికి వెళ్ళి ఆ పిల్లని కలుసుకోవాలట" అని నిట్టూర్చుతూచెప్పింది.

ఆ సంగతి వినేటప్పటికి నామీద పిడుగు పడినట్లయింది. కోరా అంత శీఘ్రంగా మమ్మల్ని వదలిపెట్టి వెళ్తుందనుకోలేదు. నా వుత్సాహం, ఆనందం మాయమయ్యాయి. కోరా మా యింటికి రాకరాక వచ్చింది. ఇన్నాళ్ళూ ఎంతో హాయిగా వున్నాం. అది నన్ను ఆనందసముద్రంలో ముంచెత్తింది. కోరా మా యింటికి వచ్చాక నేను చిలిపిపనులు మానేశాను. భాగ్యవంతుల యింట్లో పుట్టి పెరిగిన కోరా పటాటోపం ఏమీ లేకుండా మా యింటి పనులు చేస్తూవచ్చింది. అమ్మని పనిచెయ్యనిచ్చేదికాదు. అక్కయ్యనీ పనిచేయ నివ్వదు. అన్నిట్లోను తను చెయ్యేసితీరాలి. దానికున్నంత కలుపుగోలుతనం నేనింకే పిల్లలోను యింతవరకు చూడలేదు. ఇంటిపనులు తెమిలితే ఏవో కబుర్లు చెబుతూ, మమ్మల్ని ఆనందపర్చేది. ఎలాటి క్లిష్టసమస్యలైనా అతి సులభంగా విడదీసేది. కోరా ధైర్యసాహసాలు, పట్టుదల చెప్పశక్యంకాదు. అది వచ్చాక మా అమ్మ ఎంతో సంతోషంగా వుంటోంది "మన కోరా చూడు; అన్నీ ఎలా చక్కబెడుతుందో! చూసైనా నువ్వు నేర్చుకోవే అమ్మాయ్" అని అక్కయ్యతో అంటూండేది.

అక్కయ్యకు కోరా అంటే ప్రాణం. కోరావద్ద ఎన్నో నేర్చుకొన్నది. అక్కయ్య తత్వమే మారిపోయింది. అమ్మ అంటే అక్కయ్యకి ఎంతభక్తి, ఎంత గౌరవం?

నేనూ ఈ రోజుల్లో పూర్తిగా మారిపోయాననే చెప్పాలి. సెలవుల్లో చిలిపిపనులు చేయడానికి నాకు కావలసినంత అవకాశం. కాని కోరా ఏమనుకుంటుందో అని బుద్ధిగా వుండసాగాను. బయటికి ఏదైనా పనిమీద వెళ్ళినా, నా ధ్యాసంతా ఇంటిమీదే. ఆ పని చప్పున చేసుకొని యింటికి వచ్చేసేవాణ్ని. ఇంట్లో వున్నంతసేపూ కోరాదగ్గిరే వుండేవాణ్ణి. దానికి యింటిపనుల్లో తోడ్పడుతూ' అది చెప్పే కబుర్లు వింటూ, ఇతరగొడవలు మర్చిపోయేవాణ్ని.

కోరాని గాఢంగా ప్రేమించాను. ఆ పిల్లని ఎంతగా ప్రేమించానో మాటల్లో చెప్పలేను. ఆడపిల్లలంటే సవేమిరా సరిపడేదికాదు నాకు. వాళ్ళని

చూస్తేనే నాకు జంకు! చెప్పరానంత భయం! వాళ్ళు ఏ అఘాయిత్యం చేస్తారో నని గిజగిజలాడేవాణ్ని. కోరాకి నా పిరికితనం తెలుసు. అది నా తత్వాన్నే మార్చివేసింది, వయస్సులో కోరాకన్నా చిన్నవాణ్ణే. దాని చెప్పుచేతల్లో పెద వాళ్ళలోకాన్ని, అందులోని లోతుపాతుల్ని చక్కగా అర్థంచేసుకున్నాను.

కోరా మమ్మల్ని వదలిపెట్టి తమ దేశానికి వెళ్ళిపోబోతున్నది. వారం రోజుల్లోనే అది వెళ్ళిపోవడం! అది వెళ్ళిపోతే నే నెలా బ్రతకగలనో! నాలో కొత్త కొత్త ఆదర్శాలు, ఆశలు రగుల్కొల్పిందాయె!

నా హైస్కూలు, కాలేజి చదువు పూర్తిఅవడానికి ఏడెనిమిది సంవత్సరాలు పట్టుతుంది. పరీక్షల్లో మంచి మార్కులే సంపాదించుకుంటాను. ప్రొఫెసర్లు నా తెలివితేటలు చూసి ఆశ్చర్యపోతారు. అలా కష్టపడి చదివి పరీక్షల్లో నెగ్గడానికి తగిన గట్టిపునాదులు వేసింది కోరా. కాని తర్వాత?

కోరాని చూడకపోయినా, దానితో మాట్లాడకపోయినా, దాంతో ప్రతి రోజూ వూరంతా చుట్టిరాకపోయినా....కోరా నన్నెందుకు వదిలిపెట్టి వెళ్ళాలి? వాళ్లనాన్న కోరాని వెంటనే రమ్మని రాశాడు. అది తనదగ్గర లేకపోతే తనకు ఎలాగో వున్నదని దానికి ప్రతిజాబులోనూ రాస్తూవున్నాడు. ఎంతకాలమని కోరా వాళ్ళ అమ్మా, నాన్నదగ్గర వుంటుంది? అలా వుండకపోతే దాని భవిష్యతు? ఆ సంగతే వాళ్లు ఆలోచించరేం? కోరాని నేను పెండ్లిచేసుకుంటే? నా కేనాటికైనా అంత అదృష్టం లభిస్తుందా? దాన్ని మరెవరైనా పెళ్లిచేసుకొంటేనో? ఇవీ నా ఆలోచనలు. కోరా వెళ్ళిపోతుందని అమ్మ చెప్పినలగాయతు నా ఆవేదన ఏం చెప్పను?

ఇక మా అమ్మ సంగతో? అమ్మకు ప్రయాణమంటేనే గుండె గుభేలుమంటుంది. ఒక్కసారి మాత్రమే పడవప్రయాణం చేసింది. వాంతులయి నాయి. విపరీతమైన తలనొప్పి......పడవ మునిగి పోతున్నట్లనిపించింది. తను పడవతోపాటు సముద్రదేవతకి బలిఅయిపోవాల్సివస్తుందదే భయంతో ప్రాణాల్ని బిగబట్టుకొని బాధపడింది. ఇంతకూ ఆ ప్రయాణం రెండుగంటలే. అలాంటప్పుడు మరి కోరాగతో? హిందూదేశానికి ఎన్ని వేలమైళ్ళదూరం

ఎన్నాళ్లు ఈ పిల్ల ఓడప్రయాణం చెయ్యాలో! సముద్రంలో తుపానులు రేగుతూ వుంటాయి. అవి ఓడలోని ప్రయాణీకులను పెట్టేకష్టాల........ పుస్తకాల్లో చదివాను........అన్ని రోజులు ఎలా ప్రయాణంచేయగల్గుతుందో!

అమ్మకు ఇదే భయం. తన భయాన్ని కోరాతో ఒకనాడు చెప్పింది కూడాను. కోరా చిరునవ్వునవ్వి "నేను ప్రయాణం చేయబోయే ఓడ చాలా పెద్దది. అందులో అన్ని సౌకర్యాలూ వుంటాయి. జబ్బుచేస్తే చూడడానికి డాక్టర్లు వుంటారు. మనం హాయిగా విశ్రాంతితీసుకోవచ్చు. ఈ విషయంలో నువ్వేమాత్రం గాభరాపడనక్కరలేదు." అని అమ్మకి నచ్చజెప్పింది.

"మమ్మల్ని విడిచిపెట్టిపోవడం నీకు ఇష్టమేనా?" అంది అమ్మ

"నాకూ విచారంగానే వుంది. మా అమ్మకన్నా ఎక్కువగా నన్ను చూసుకొన్నావు. అక్కయ్య నాకు స్వంత అక్కయ్య అయిపోయింది. దాన్ని వదలివెళ్ళడమంటే ఎంతో కష్టంగావుంది......ఎంతమంది బంధువుల్ని చూడగలిగాను! మాకు ఇంతమంది చుట్టాలు వున్నారని నాకు ఆ దేశంలో వుండగా తెలియనే తెలియదు. ఏ బంధులయింటికి వెళ్ళినా, వాళ్ళు నాకుచూపిన వాత్సల్యాన్ని ఎలా మరచిపోగలను చెప్పు? ఇక ఈ వూళ్ళో నేను నేర్చుకొన్న ఆటలు పాటలు, ఎలా మర్చిపోతాను? బొంబాయిలో నా కిలాంటి అవకాశాలే వుండవు. ....నాయందు మీకెంతో వాత్సల్యం. మిమ్మల్నందర్నీ విడిచిపెట్టి ఎలా వెళ్తానో!......" అని కోరా కంటతడిపెట్టుకుంది.

ఆ కడపటి రోజుల్లో కోరాకి అన్నం సయించేదేకాదు. అమ్మా, అక్కయ్యా ఎంతో బలవంతంచేయాల్సి వచ్చింది!

వాళ్ళనాన్న దాన్ని వెంటనే రమ్మని రాశాడు అది వెళ్ళితీరాల్సిందే.

మా వూళ్ళోవాళ్ళందరికీ కోరాప్రయాణంసంగతి తెలిసింది. ఎంతో మంది వచ్చారు దాన్ని చూడడానికి. అందరూ కోరా వెళ్లిపోతున్నందుకు తమకెంతో కష్టంగా వుందని అనేవాళ్ళే!

ఇక వోస్కరు సంగతి ఏం చెప్పను? పంతులు సంగతో!......

వాళ్ళసంగతి అలావుంచి మా ఫ్రాన్సుసంగతిమరీను. ఈ కబురు విని వాడుపడ్డ

అవస్థ వర్ణించలేను. ఆ పిల్లను పెళ్ళిచేసుకోవాలని వాడికోరిక. కోరా అంగీక రిస్తే ఆ ప్రయాణం ఆపేయవచ్చు, "కోరాకి కావలసిన దుస్తులు, నగలు కొని యిస్తాను. కొత్తయిల్లు కట్టిస్తాను. పెద్ద విందుచేస్తాను. వూళ్ళోవాళ్ళందర్నీ విందుకు ఆహ్వానిస్తాను" ఇలాంటి పిచ్చికోరికలు ఫ్రాన్సును అల్లకల్లోలం చేస్తున్నాయి. కానియివన్నీ గాలిమేడ లే! వాటి ఆవేదననెవరుఅర్థంచేసుకుంటారు?

కోరా సామాను సర్దుకోవడంలో లీనమైపోయింది. తన గదిలోనుంచి బయటికి వచ్చేదికాదు. పూర్వంవలె ఖులాసాగా కబుర్లుచెబుతూ మమ్మల్ని సంతోషపెట్టడానికి తీరిక వుంటేకదూ?.......ఒకనాటి ఉదయం సాహసించి నేను కోరా గదిలోకి వెళ్ళాను. "నేనుకూడా సర్దిపెట్టనా?" అని అడిగాను. కోరా మందహాసంచేసింది. నన్ను ముద్దుపెట్టుకొంది. "లూడ్విగ్! నీ అంత బుద్ధిమంతుని ఎక్కడా చూడలేదోయ్" అని నవ్వింది........"నిన్ను విడిచి పెట్టివెళ్ళడానికి నాకూ ఎంతో కష్టంగావుంది" అని పెద్ద నిట్టూర్పువిడుస్తూ కంట తడిపెట్టింది.



"కోరా! నువ్వు వెళ్ళొద్దు. ఇక్కడే వుండిపో" అంటూ కోరాని గట్టిగా కౌగలించుకొన్నాను—"కోరా! నిన్ను పెళ్ళిచేసుకుంటాను. నేను బాగా చదివి పరీక్ష పాసవుతాను." అన్నాను. కోరా ఫక్కున నవ్వింది.

"నువ్వు కుర్రవాడివి. పెళ్ళిసంగతి మరచిపో" అంది నన్ను హృదయానికి హత్తుకుంటూ.

కోరా ఇలా అనటంతో ఎంతో బాధపడ్డాను. "అలాగైతే ఆసంగతి ఈ జన్మలోనే తలపెట్టనులే" అంటూ విచారంతో దుఃఖించ నారంభించాను.

"లూడ్విగ్! నువ్వు అలా అనడం, దుఃఖించడం మంచిదికాదు. దీంతో నన్ను బాధపెట్టడం మంచిదా చెప్పు" అంది కోరా.

"నన్ను పెళ్ళిచేసుకోడానికి ఇష్టం లేకపోతే.......పోనీ, ఫ్రాన్సుని పెళ్ళిచేసుకో. వాడు నిన్ను ప్రేమించాడు. పాపం! నీకోసం కలవరించుతున్నాడు. నా కన్నా పెద్దవాడు........నువ్వు వాడికోరిక తీర్చావా......." అని ఫ్రాన్సు సంగతి ముచ్చటించాను. ఇది విని కోరా మొహం ఎర్రబడ్డది. నన్ను కసిరింది. "అతడు నిన్ను అడగమన్నాడా?" అంటూ నాకేసి వురిమిచూచింది.

"వాడు నాకేమీ చెప్పలేదు కోరా! నేను నిన్ను ఇలా అడుగుతానని కూడా వాడికి తెలియదు" అన్నాను ఎలాగో.

"అలాగయితే ఫ్రాన్స్ నన్నెందుకు అడగలేదు?"

"వాడికి నీతో మాట్లాడడానికి ధైర్యం వుండేదనూ? వాడు నిన్ను గాఢంగా ప్రేమించాడని మొదటినుంచీ నాకుతెలుసు" అన్నాను.

కోరాకి నా మాటలతో కోపం వచ్చింది. నా చెవి పట్టుకొని గట్టిగా మెలేస్తూ "ఇదిగో చూడు లూడ్విగ్! ఈ పెద్దపెద్ద విషయాలు నీ కెందుకు? నువ్వు కుర్రవాడివి. ఆడపిల్లల్తో ఇలాటి మాటలు అనకూడదు. అమ్మ ఎంతో మంచిది. ఆవిడ మర్యాద నువ్వు నిలబెట్టాలి. నువ్వు బాగా చదువుకోవాలి. చిలిపిపనులు మానేసి, నీ తెలివితేటలను చదువులో వుపయోగించాలి. అప్పుడే అమ్మ గౌరవాన్ని కాపాడగల్గుతావు" అన్నది.

"సరేలే. నువ్వు చెప్పినట్లే తప్పకుండా నడుచుకుంటాను.......
కాని, ఒక సంగతి చెప్పు? ఫ్రాన్స్‌ని ఎందుకని పెళ్ళిచేసుకోవు?" అని అడిగాను.

"ఆ సంగతి అడగవద్దని చెప్పానుకదూ?" అని నన్ను గద్దించింది. కాస్సేపు మాట్లాడనేలేదు....తరువాత ఏమనుకున్నదో కాని, నా భుజంతట్టుతూ ఆప్యాయంగా 'చదివి పెద్దవాడివయ్యాక, బొంబాయివచ్చి కొంతకాలం మా దగ్గర వుండు" అంది.

"తప్పకుండా వస్తాను. వచ్చి పెద్దపులిని చంపాలి. ఇదే నాకోరిక"

"అందుకు కావలసిన సహాయం చేయడానికి నాన్న వున్నాడుకదూ? మరి నువ్వు చిలిపిపనులు మానేసి బాగా చదువుకో. అమ్మని జాగ్రత్తగా చూసు కొంటూ వుండాలి సుమా!" అంటూ నా చేతిని గట్టిగా నొక్కి ముద్దుపెట్టుకుంది.

నేను కోరా చెప్పినట్లే నడుచుకుంటానని వాగ్దానంచేశాను.

స్థానికవార్తాపత్రిక కోరా ప్రయాణాన్ని గురించి యిలా ప్రకటించింది.

"మా వూళ్లోవున్న తమ బంధువులను చూడడానికి బ్రాహ్మణ దేశాన్నుంచి వచ్చిన యువతి—కోరా కొద్దిరోజుల్లో తిరిగి ఆ దేశానికి వెళ్లబోతున్నది. ఆమె తన ప్రయాణం కులాసాగా కొనసాగించి క్షేమంగా స్వదేశానికి చేరాలని మనఃపూర్వకంగా ఆశిస్తున్నాం"

అమ్మ ఈ వార్తను చదివి ఎంతో గర్వపడి, కోరాకి చూపించింది.

మా వూళ్ళో అందరూ కోరాని గురించే కబుర్లు చెప్పుకోసాగారు. నేను ఏ షాపుకి వెళ్లినా కోరా ప్రయాణం ఎప్పుడని అడుగుతున్నారు. బంధువులను చూడడానికి వెళ్ళినా ఈ ప్రసక్తే.

మాకంటే మా పనిమనిషి ఎంతో విచారపడసాగింది. దాన్ని సముదాయించడానికి కోరా శతవిధాల ప్రయత్నించింది. మ్యాప్ తెచ్చి దానికి చూపించింది. దానిలో మా వూరు, తాను వెళ్లబోయే పట్టణం చూపి, తను వెళ్లాల్సిన మార్గాన్ని వివరిస్తూ దాన్ని కొంత తృప్తిపరిచింది. కాని ఆ సంతోషం ఎంతసేపు? కోరా అవతలికి వెళ్ళిందో లేదో పనిమనిషి గావురుమన్నది.

ఆదివారం రానే వచ్చింది. ఆ రోజే కోరా ప్రయాణం. ఉదయం పదిగంటల రైల్లో వెళ్తుంది. అందరం స్టేషనుకు వచ్చాం. బండి ప్లాటుఫారం మీదికి వచ్చింది. మమ్మల్నందర్నీ వదలిపెట్టి వెళ్ళడానికి కోరా ఎంతో చింతించింది. వారం వారం వుత్తరాలు రాస్తాననీ, తనకోసం మమ్మల్ని బెంగపెట్టుకోవద్దనీ, కంట తడిపెటుకొని అంది.

అత్తయ్యా, మామయ్యా, రోసా కోరాని సాగనంపడానికి వచ్చారు. వాళ్ళతో వోస్కరూ వచ్చాడు. పంతులు పూలదండతో ప్రత్యక్షమయ్యాడు.

అత్తయ్య ఇదంతాచూచి వుడికిపోయింది. కోరాని ఇలా గౌరవంగా సాగనంపడం ఆవిడ ఓర్వలేకపోయింది. ఆ చుప్పనాతి అందరిముందూ తన ఉక్రోషాన్ని వెళ్ళగ్రక్కింది.

"కోరా! నువ్వు మీదేశానికి వెళ్ళిపోవడం నాకు చాలా సంతోషం. అక్కడ నీకు హాయిగా వుంటుంది. అక్కడవున్న సౌకర్యాలు మా దేశంలో బొత్తిగాలేవు" అన్నది అత్తయ్య.

మావయ్య అత్తయ్యకేసి చూసి అలా వాగవద్దని ప్రాధేయపడ్డాడు. కాని ఆవిడ వింటేనా!........

గారు కోరాని అభినందించాడు. ఆమె సామాను తనే సర్దిపెట్టాడు. స్టేషనుమాస్టరు కరస్పర్శ చేస్తూ, కోరా వెళ్ళిపోతున్నందుకు విచారం వెలిబుచ్చాడు. వోస్కరు, పంతులూ పెట్టెదగ్గిరే నిలబడి కన్నీళ్ళపర్యంతమయ్యారు.

అందరూ కోరాకు పూలు, పండ్లు ఇచ్చారు. అందరివద్దా సెలవు పుచ్చుకొని ఆమె బండిలో యెక్కింది. గార్డు పచ్చజండా చూపుతూ ఈల వేశాడు. బండి కదిలింది. కోరా మాకేసి చూస్తూ చేతిరుమాలు ఆడించింది.

కోరా వెళ్ళిపోయింది! మమ్మందరినీ విడిచిపెట్టి వెళ్ళిపోయింది!

